ఆంధ్ర

# శివానందలహరి



గ్రంథకర్త:
కవిభూషణ, కవిశేఖర, శిష్ట్లా వేంకటసుబ్బయ్య
ప్రధానాంధ్రోపాధ్యాయుడు
సైలరున్నతపాఠశాల.



సంధ్యారంభ విజృంభితం శ్రుతి శిరస్థానాంతరాధిష్ఠితం
సప్రేమ భ్రమరాభిరామ మసకృత్సద్వాసనా శోభితం
భోగీంద్రాభరణం సమస్త సుమనఃపూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్॥ 50

శ్రీ గురుమూ ర్తయేనమః

# అభిప్రాయము.

శివానందలహరి యను సంస్కృత పద్యకావ్యమునకు రచయిత జగద్గురు శ్రీ శంకర భగవత్పూజ్యపాదులు. దాని నాంధ్రీకరించి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులైనవారు నరసాపురము హైలరున్నత పాఠశాలా ప్రథానాంధ్రోపండితులు, కవిభూషణ, కవిశేఖర, బిరుదాంకితులగు శ్రీ శిష్టా వేంకటసుబ్బయ్యగారు. ఈ కృతి నిర్మాణమున కాంధ్రీకర్తను ప్రేరించి యంకితముగాఁ గొని యచ్చొత్తించిన యుదారులు "దేవ" గ్రామవాస్తవ్యులు శ్రీ మన్నె బుల్లితిరుపతి రాయుఁడుగారు. ఈ ముప్పురనుగూర్చి యొకింత ప్రసంగింపకుండుట న్యాయముకాదు. కావున ముందుగా నందులకుఁ బూనుకొందును.

మ. రసనారంగ నటచ్చతుర్ముఖ వధూరత్నాంఘ్రి మంజీర భూ
రసితంబో, విలసత్తదీయ కటిభారస్ఫారసౌవర్ణ సా
రసనారావమొ, తచ్చలత్కరయుగీ రాజన్మణీకంకణో
ల్లసిత క్వాణమొ, నాఁగ శంకరు కలాలాపంబులే పారెడున్.

అని వర్ణింపఁబడిన శ్రీ శంకరాచార్యులవారి, నిరుపమ కవితా విలాసము నావంటివాఁడు వివరింపఁబూనుట సాహసమగును. శారీరక మీమాంసాదులం దా మహనీయుని రచన మెంత పటిష్ఠమును, గంభీరార్థ సంభృతమునై దిగ్భ్రమ పుట్టించునో భగవత్స్తుతి కావ్యములం దా కవీంద్రుని రచన మంత సులభమును, మృదుమధుర భావ నిబిడమును, లలితాతి లలితమును, రసవంతమునై సహృదయుల హృదయముల జల్లు రనిపించును. భగవత్తేజోదివ్యదర్శనమునఁ దాము

పొందిన యనుభవములను మనోహరమగు కల్పనలతో, శబ్ద శిల్పములతో, ముముక్షు చిత్తాకర్షకముగాఁ బండిత హృదయంగమముగా, సత్కవిజనాదర్శముగా, జగద్ధితబుద్ధిని గావ్యరూపమున ననుగ్రహించిన శ్రీ భగవత్పాదుల ఋణము భారతీయులకుఁ దీర్పరానిది. ఆయన ఘుని యపార కావ్యవాఙ్మయ సుధాంబుధి యందలి తరంగైకతమ మందలి యొకొక్క బిందువగునేమో యీ శివానందలహరి మున్నగు లహరు లన్నియును. ఈ లహరు లన్నింటను సొగసైన నడకతో మెఱయు శిఖరిణీ వృత్తములతోఁ గవితాకన్య గాన మొనర్చుచుండును. పరిశీలింప శివానందలహరిలో మాత్రమే యారంభమున నిరువదేడు శిఖరిణీ వృత్తములు కనిపించును గాని ఆనంద, సౌందర్య, జీవన్ముక్తానందల హరులలోఁ బరిపూర్ణముగా శిఖరిణీ వృత్తములే కనఁబడును. భవభూతికిఁ దరువాత శిఖరిణీ వృత్తము నంత సొగసుగా నడిపిన మహాకవి యొక్క శంకరులే యనినఁ దప్పుకాఁబోదు. శివానందలహరిలోఁ దొల్తటి 27 పద్యములపై శార్దూల విక్రీడితాది వివిధ వృత్తము లగపడును. ఆయన యితర లహరులకు దీనికి నింతయే భేదము. శతపద్య పరిమితమగు నీ లహరిని మకుటము లేని శతకమని యాంధ్ర వాఙ్మయ చరిత్రకారులు పేరు పెట్టినను బెట్టనచ్చును. శతకనామముతో మకుటము లేకయే సంస్కృతమున నొకటి రెండు లేకపోలేదు. మయూరుని సూర్య శతకము, కుట్టికవిమహిమశతకము, నిట్టివే. శివానందలహరి, సౌందర్య లహరి శతపద్య పరిమితములుగఁ గనఁబడుటచే నీ రెంటిని 'శతకము' లన్నను, ఆనందలహరియు, జీవన్ముక్తానందలహరియు ముప్పది పద్యము లించుమించుగాఁ గలవగుటచే శతకమన వీలుగాదు. కావున లహరీ కావ్యములను ముక్తక భేదములుగాఁ బరిగణించుట న్యాయ్య మనిపించుచున్నది.

ఈ శివానందలహరి నాంధ్రీకరించినవారు శ్రీ వేంకటసుబ్బయ్య కవివర్యులని తొలుత సూచింపఁబడినది. ఉభయ భాషలందుఁ దల స్పర్శమగు పాండితి లేక సంస్కృతమునఁగల రసభావాలంకారాది సకల విశేషములను జీర్ణించుకొనఁగలరా? జీర్ణించుకొన్నను దెనుఁగు నుడికారపు సొంపులతో వెలిఁబుచ్చఁగలరా ? మూలకారుఁడు తన భాషలో స్వేచ్ఛముగ రచన సాగించు కొనవచ్చును. అనువాదకున కట్టి స్వేచ్ఛ యుండునా ? ఒక భాషయందలి జాతీయము వేఱొక భాషలోనికి జాతీయరూపముననే వెలువరించుట సామాన్యమా ? ఇట్టి యనేక క్లేశములున్నవి కావుననే కొఱవి గోపరాజకవి సింహాసన ద్వాత్రింశికయందు—

ఉ. ఈ సరసోక్తి కావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్ల వీఁడు మఱిచేయుట యేటిది యంచుఁజెప్పఁగాఁ
జేసి యనాదరంబురక చేయకుఁడీ - విలుకాఁడు తూఁటుగా
నేసిన నందె పాఱ మఱి యేసిన వాని దనూటి గావునన్.

అనినాఁడు. మఱియుఁ గళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితులు, సుప్రసిద్ధులు నగు (శ్రీ) జయంతి రామయ్య పంతులుగారు అమరు కావ్యము, ఉత్తర రామచరిత నాటకము, చంపూ రామాయణము నాంధ్రీకరించుచు ననుభూతమగు తమ క్లేశము నిట్లు తెలిపియున్నారు.

ఉ. దీటుగ సంస్కృతంబునకుఁ దెన్గొనరించెడువారు మూలముం
దాటక, భావముం రసముఁ దప్పక వచ్చెడు నట్టు లెంతయుం
దేటగ వేఱుమాటలను దెల్పినఁ బొల్పగుఁగాక యెట్టులో
మాటకు మాటఁబెట్టి యొక మాడ్కిని మాటిన మెత్తురే బుధుల్.

గీ. పలుకుబడి వేఱు పద పరిపాటి వేఱు
రీతులును వేఱ యన్వయ రీతి వేఱు

భావభావకు ననుమాట భావమందుఁ
జేర్చి సంస్కృతమును దెన్గు సేయవలయు.

కం. 'తెలుఁగుననె పుట్టె నీకృతి
తొలుత' ననెడు భావమాత్మఁ దోఁచెడు భంగిన్
జెలఁగిన యనువాదము సర
సుల కింపొనఁగాకయున్న శోభింపదిలన్.

ఇట్టి క్లేశమునకోర్చి శ్రీ వేంకటసుబ్బయ్యగారీ యాంధ్రీకరణమునఁ గృతకృత్యులైనారు. వీరి యాంధ్రీకరణమున వ్యర్థ, విరుద్ధార్థాది దోషములుగాని ఆంధ్ర జాతీయమునకు వికృతులుగాని లేక స్వయంభువమట్లు కనఁబడుచున్నది. తెలుఁగుసేఁత కదియేకదా ప్రధానగుణము. మచ్చున కీ క్రింది పద్యములు పరిశీలింపఁదగు.

మూ. గళంతీ శంభో త్వచ్చరితసరితః కిల్బిషరజో
దళంతీ ధీకుల్యాసరణిషు పతంతీ విజయతాం
దిశంతీ సంసారభ్రమణపరితాపోపశమనం
వసంతీ మచ్చేతో హ్రదభువి శివానందలహరీ.

ఉ. విందిడు నీ కథానదిని వెల్వడి, పాపరజమ్మునూడ్చి, ని
స్తంద్రమతి ప్రసారణుల దారులఁజొచ్చి భవోగ్రతాపమున్
మందగఁజేసి డెందమను మడ్గుననిల్చి, యజస్రమున్ శివా
నంద ఝరీవరమ్ము శ్రితనందనమై వెలుఁగొందుఁ గావుతన్.

మూలమందలి గళంతీ ప్రభృతి శతృంతములు తెనుఁగున నందగింపవు. అట్టివి తెలుఁగునలేవు. కావున నయ్యవి విడిచి తదర్థద్యోతక పదములే గ్రహింపఁబడినవి. అంత మాత్రమునఁ దెనుఁగు సేఁత కొంకొఱఁత కలుగఁబోదు.

# విన్నపము.

శ్రీ శంకర భగవత్పాదులు పరమ శివావతారమనుట లోక నిశ్చితము. ఆ మహాత్ముని దిగంత విశ్రాంత పవిత్ర యశోరాశిని గీర్తించు భాగ్యము సామాన్యుల కబ్బదను నానుడి లోకంబునఁ గలదు. కావుననే నా రచింపంబడిన "సుబ్బకవీయ" మను నామాంతరముగల శతకత్రయమున వైరాగ్యలహరికి 'అన్యథా శరణం నాస్తి' యనునట్లు ఆచార్యులవారి వివేక చూడామణిలోని నూఱు శ్లోకంబుల నాంధ్రీకరించితి. అతి సుకుమారమై, ప్రసన్నభావగంభీరమై, మధురాతిమధురమై, భాక్తిక జనానంద సంధాయకంబై, వియద్గంగోత్తుంగ తరంగ భంగమంబై, సకల విద్వద్హృదయంగమంబై యొప్పాఱు నా మహనీయుని శివానందలహరీ శ్లోకంబులు నేటికిని నిరంతరము నుతించి పఠించువారు గలరు. తచ్ఛ్లోకంబుల నాంధ్రంబున నుతించుకొనవలయునను తలంపున నా శ్లోకంబుల నెట్లో పాదబద్ధ మొనరించి యానందించితి నంతియేకాని యయ్యనన్యసామాన్య వాగమృతధారను తెనుఁగు మాగాణిఁ బ్రవహింపఁజేసి పండింతునను నాశాహం కృతులతోఁ గాదని త్రికరణ శుద్ధిగా విపశ్చిల్లోకమునకు విన్నవించు కొనుచున్నాఁడను.

ఇట్లుండ దేవ వాస్తవ్యులును, భక్త పరతంత్రులగు శ్రీమన్నె బుల్లితిరుపతిరాయుఁడుగారు శ్రీశైలయాత్రఁ జేసి రాగా ప్రసంగవశంబునఁ గృతి ప్రాశస్త్యమును, శివానందలహరీ మహిమమ్మువినుతింప నే తద్గ్రంథమును విని సరసత్వంబు మెఱయ నానందించి కృతి స్వీకృతి కంగీకరించి దీని ప్రకటనకుఁ బూనుకొనిరి. చిత్రవిచిత్ర

ఈ రీతిగా గ్రంథము నంతయు సరళ మధుర శైలిలో నాంధ్రీక రించి ఈ కవిశేఖరులు కృతకృత్యులైనారు.

ఏ పద్యము చూచినను శ్రీ రామయ్యపంతులుగారు సెలవిచ్చి నట్లు "తెలుఁగున నె పుట్టె నీ కృతి । తొలుత ననెడు భావమాత్మఁ" దోఁపక మానదు. ఇంతకు పూర్వము వీరు దుర్వాసోరామాయణాది పెక్కు పద్యకావ్యములు రచించిన సిద్ధహస్తు లగుటచేతనే శంకరుల వంటి లోకోత్తర కవి కావ్యమును నింత ధారాళమగు ఫణితిలోఁ దెలిఁగింపఁ గల్గినారు. సహృదయు లీ గ్రంథ మామూలచూడము పరికించి నా యభిప్రాయమున నేకీభవింపక మానరని విశ్వసించు చున్నాను.

ఈ కావ్య నిర్మితికిఁ బ్రేరకులై ముద్రాపమునకు ధూర్వహులై కవిశోపాటు సారస్వత ప్రపంచమున సుస్థిర కీర్తిచంద్రికలతో ధ్రువత్వ మార్జించు కొనిన శ్రీ మన్నె బుల్లితిరుపతిరాయుఁడుగారి పేరు స్మర్తవ్యము. ఎంత పరమ శివభక్తియు, నెంత పండితాదరము, నెంత కవితారస పిపాసయు లేక యిట్టి గ్రంథము నంకితముగాఁగొను తలంపు గాని, వలసిన ధనము వ్యయించి గ్రంథ మచ్చొత్తించి, విజ్ఞుల కందఁ జేయు నుత్సాహముగాని, అనర్ఘ పారితోషికములఁ గవి సన్మానము గావించుటగాని యలవడునా ! శ్రీ బుల్లితిరుపతిరాయుఁడుగా రిట్లు ప్రోత్సహించుచుండ శ్రీ వేంకటసుబ్బయ్యగా రిట్టి పరమ పురుషార్థ సాధక గ్రంథము లింకను రచించి యాంధ్ర శారద నలరింతురు గాత !.

అమలాపురము,
1-1-1958.

ఇట్లు,
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి





కృతిభర్త:

మన్నె బుల్లితిరుపతిరాయఁడు

శ్రీ

# ఆంధ్ర శివానందలహరి

## అంకితము.

శ్రీరాజత్తుహినాద్రి వాసులు జగత్క్షేమంకరాకారు లం
భోరుడ్జన్మ ముఖామరార్చిత పదాబ్జుల్ భక్తవర్గావనో
దారస్ఫారులు శాంకరీ శివులు నిత్యప్రార్థితార్థంబు ల
వ్వారిం గూఱిచి ప్రోచుఁగావుతఁ గృతిస్వామీంద్రునిం దిర్పతిన్.1

శా. సీతాకల్పలతాకమై దశరథక్ష్మాబ్ధిజంబై శ్రిత
వ్రాతానందదమై మనోజ్ఞ సుమనోవారాధికామోదితం
బై తత్సోదరమూలమై శయఁకిసవ్యాపూర్ణమౌ రామ వి
ఖ్యాతామర్త్యకుజంబు తిర్పతిని మత్కావ్య ప్రభుం బ్రోచుతన్. 2

చ. హరి మురిపెంపుటింతి వికచాంబుజ పీఠిక వెల్గుచాన య
య్యిరి విలుకాని తల్లి చలివెల్గునకుం సయిదోడు లక్ష్మి వి
స్ఫురదురు నర్తనక్రియలఁ బొల్చుత మత్కృతిభర్తయైన శ్రీ
తిరుపతిరాయు ధామమున ధింధిమిధింధిమి యంచు నెప్పుడున్. 3

చ. అభిరతిమీఱ నెవ్వని హృదబ్జమునందుఁ బ్రతిష్ఠచేసి భ
క్తి భరమెసంగఁ గొల్చునెడఁ గేవలముం శుభముల్ ఘటిల్లి దు
ర్లభమగు నీప్సితంబు లురలంగల వట్టి శుభప్రదాయకుం
డిభముఖుఁడో ముమామకకృతీంద్రుని విఘ్నములం దొలంచుచున్.

శా. ఏ వాగ్దేవత కర్ణభూషణమునం దేపాఱు కహ్లార ధూ
ళీ విక్షేపణ లేశమాత్రమునఁ గాళీదాస భాసాదులుం
గైవారం బొనరింతు రట్టి పలుకుంగ్రాల్గంటి నర్థింతు వా
క్ప్రావీణ్యంబున కర్థసిద్ధికిని ధారాశుద్ధి సంసిద్ధికిన్. 5

"ఉ. నన్నయ తిక్కనాది కవినాథు లెఱుంగనివారె? శాస్త్ర సం
పన్నులు గారె వారు? కృతి మన్నులజేండ్ల నొసంగ లేదె? త
ప్పన్న నెటాచరింతు రిదియొక్కటిమాత్రమె శాశ్వతమ్ము సూ
మన్నెకులాబ్ధి చంద్ర! వినుమా! బులితిర్పతిరాయ ధీమణీ! 6

ఉ. శాశ్వత కీర్తికాంత కరసారసముఁ గ్రహియించు పొంటె మీ
శశ్వదుదార వంశజులు సన్నిహితాప్తులు స్వాపతేయముల్
నశ్వరముల్ సుమా యనుచు నా కవితాలలితాంగిఁ గోరుచున్
విశ్వ మహీనుతిం గనిరి విన్నది యాస్థను మన్నెవంశజా! 7

శా. మీ వంశీయుఁడొకండు రెండుకృతులఁ మేకొంచుఁ జేపట్టె, న
య్యైవియ్యంకుఁడు పార్వతీ పరిణయం బాశించె వేయార్లతో
మీ వియ్యంకుఁడె సత్కృతిం గొనియెఁ జుమ్మీ! చౌదరీలెందఱో
మా వాణిం గొనియాడి సత్సభల సమ్మానించి రర్హక్రియన్. 8

శా. శక్తిస్ఫాయ దుదారచిత్తతను శ్రీ శైలేశు సేవించుచున్
యుక్తాయుక్త విచక్షణోన్నతుఁడవై యుంటంగదా! భక్తి భా
వోక్తంబైన శివప్రమోదలహరీవ్యూహంబుఁ దెన్గించి యా
సక్తిన్నీకు నొసంగి కీర్తిలత లాశాశ్రేణిఁ బ్రాఁకించెదన్. 9

కం. ఇహపరసాధన ఘనమై
బహుళామోదకర మఖిల భక్తిక సుమనో
మహిజంబై రహియింపదె
మహిని శివానందలహరి మన్నెకులీనా! 10

మ. గురువుల్ శంకరు లిక్షుఫాణితసుధా గోక్షీర నీహార సం
భరధారాళరసప్రవాహములకున్ మాధుర్యమున్ శైత్యమున్
గఱపంజాలిన వాక్ప్రపంచము జగత్కల్యాణ సంసిద్ధికై
నెఱపంగల్గిరి తత్కృతీంద్రమునకున్ నేత్కృత్వ మల్పిష్ఠమే!" 11

కం. అని కృతి ప్రాశస్త్యము నే
వినిపించిన విని మొగమునఁబిన నవ్వొలయన్
దన ముత్తరముల క్రమముల
నొనఁగూర్చిన మత్కృతీశు నుట్టంకింతున్. 12

సీ. కలశాబ్ధి కన్యకా కరసరోజ ద్వయీ
సంవాహన క్రియా స్థానసీమ
సకల కిల్బిషపంక సంక్షాళన పటిష్ఠ
జాహ్నవీ నిమ్నగా జన్మభూమి
త్రింశత్త్రయీకోటి దివిషత్కదంబక
పవిత్ర్యాగ్ర రత్నాకరండకంబు
బ్రహ్మర్షి రాజర్షి పరమహంసోత్కర
మహనీయ మోక్ష సామ్రాజ్యపదము
గీ. విమలతమ ఋగ్యజుస్సామ వేదనిచయ
గానముఖరిత యజ్ఞవాటీనిరంత
రాగ్ర పూజావిధాన క్రమార్హ్యాదేశ
మా మహావిష్ణుపాదాబ్జ మతిశయిల్లు. 13

కం. ఆ పాదాంభోజంబునఁ
జాపకళాశీలురు గుణశాలురు నయవి
ద్యాపారీణులు కమ్మ కు
లా పనికము లుద్భవించి రమలద్యుతులన్. 14

శా. జన్యక్షోణిని వైరిపీరవరులన్ సాధించి వేధించి రా
జన్య శ్రేష్ఠుల కెందతెందటికొ చంచద్భంగిఁ దోడొచ్చు మూ
ర్ధన్యత్వంబు ఘటించి కమ్మకులపారావార శుభ్రాంశులై
ధన్యుల్మాన్యవదాన్యశేఖరులునై దర్పించి రుర్వీస్థలిన్. 15

ఉ. వారలలో వదాన్యుఁడు నవారణ శౌర్యధురంధరుండు దు
ర్వార పరాక్రమక్రముఁ డపార దయాంబుధి వాసిరెడ్డి వం
శోరువనప్రఫుల్లకుసుమోత్తమ మాంధ్రుఁడు మన్నెరాజ్య వి
స్తారుఁడు వేంకటాద్రి గనె ధాళధళంధళకీర్తిఁ దొల్లిటన్. 16

కం. ఏతత్కమ్మకులమ్మునఁ
గాతరజన పర్యవన వికస్వర హృదయ
స్ఫీతులు సుగుణజ్యోతి
ర్వ్రాతద్యోతితులు మన్నెవంశమువారల్. 17

మ. గృహనామంబు లవేరికేనియును రా వేహేతువుల్లేకయే
బహుధా కల్గెను గ్రామనామములు; శుంభత్పేరుషాఖ్యంబు లి
మ్మహిలోఁ దక్కవ; మున్నుకోవిదకదంబంబున్ నయోపేతులై
రహిమై మన్నెములిచ్చి ప్రోచుటను సార్థంబయ్యెఁదన్నామమున్ 18

మ. కలధౌతామల కీర్తిసంతతుల దిగ్భాగంబులన్ నిల్పి ని
స్తులలేఖర్షభ భోగభాగ్య జలధిస్తోమంబునందోఁగి ని
చ్చలు శౌర్యోజ్జ్వలుఁడై యుదారుఁడయి విజ్ఞానాఢ్యుఁడై వేంకటా
చల ధీరాగ్రణి వంశకర్తయయి భాస్వద్రీతిమై భాసిలెన్. 19

కం. ఆతఁడు పెండిలి యాడెను
పూతచరిత్రను సతీవిభూషను పుంజీ
భూతగుణను నాదెమయను
ఖ్యాతాన్వయజాత సంత నాద్వయమునకున్. 20

చ. నలువ ముఖంబులో నలిననాభుని బాహులొ యజ్ఞయాగమం
బులొ పొలుపౌ యుగంబులొ ప్రపూతములౌ పురుషార్థకమ్ములో
విలసిత మూర్తులొప్పఁగఁ బవిత్రులు పుత్రులు లోకమిత్రులు
జ్వలులయి వారికింగడుపు చల్వగఁబుట్టిరి జెట్టిమల్లురై. 21

ఉ. ఆయనఘుండు నల్వురగుణాఢ్యుల ధీరులఁగాంచ లక్ష్మినా
రాయణ నాముఁడాద్యుఁడయి రాజిలె; రెండవ యాతఁడాదినా
రాయణుఁడంత రమ్యగుణుఁ డాశ్రితరక్షణశాలి సూర్యనా
రాయణుఁడున్న తాశయ పరాయణుఁడొప్పెఁదృతీయపుత్రుఁడై 22

కం. ఆయతమతి వేంకట నా
రాయణుఁ డావిర్భవించె రాజద్గుణులా
జాయాపతులకు నిరత
న్యాయపథోన్నతమతులకు నాల్గవసుతుఁడై. 23

కం. ఎఱపోతినీడి వంశ్యుఁడు
ధర వేంకట్రాయఁడతని తనయను సుగుణా
కర వేంకట రత్నాంబా
కరమున్ మూడవసుతుండు గ్రహియించె రహిన్. 24

ఉ. ఆయతకీర్తిశాలి సుగుణాంబుధి ధీనిధియైన సూర్యనా
రాయణుఁ డార్తరక్షకుఁడు రాజితవేంకట రత్నమాఖ్యయా
జాయ సహాయగాఁగ నిజసంస్కృతి సౌఖ్యచయంబులంది లేఁ
బ్రాయమునందె యందెను దివంబును ముప్పదినాలుగేండ్లకే. 25

మ. సతతార్యస్తుత సద్గుణాంచితులు భాస్వద్రూపసంపన్ను ల
చ్యుత పాదాంబుజ యుగ్మమగ్న హృదయుల్ సుత్రామసంపత్సమో
న్నతులైయొప్పు తదీయదంపతులకున్ సచ్ఛీలుఁడో బుల్లితి
ర్పతిరాయండు జనించె స్వీయకులపారావారశుభ్రాంశుఁడై. 26

గీ. పూవు పుట్టిన తోడనే తావి పుట్టు
ననెడు చందాన వానితో నవతరిల్లె
శాంతి సౌజన్య వాత్సల్య సద్గుణములు
పూర్వపుణ్యంపు వాసనల్ బుగులుకొనఁగ, 27

మ. అనఘాత్ముండగు పుత్రునభ్యుదయభాగ్యాధిక్యముం జూడనో
చని తజ్జన్ముఁడు మూడు వర్షములకే స్వర్గానకుంబోవఁ ద
జ్జననీరత్నము రత్నమాంబ బహుధా చంచద్గుణాలంబ కం
టిని రెప్పంబలెఁ బ్రోచి కాచె నయధాటిన్ మేటినేర్పొప్పఁగన్. 28

మ. రణరత్నంబు తురంగరాజము కళారత్నంబు గీతంబు వా
రణరత్నం బమరేంద్రువాహము నిశారత్నంబు చంద్రుండు రా
డ్గణరత్నం బల రాఘవేశ్వరుఁడు మేఘద్వారరత్నంబు ద్యో
మణి స్త్రీరత్నము రత్నమాంబయని సమ్మానింపరే యెల్లరున్ 29.

చ. ప్రిదులని ధైర్యసంపదను వెల్గుచు వేంకటరత్నమాంబ తాఁ
బొదువుఁదనమ్మునన్ వినయపుణ్యమునన్ దనయాస్తి నెల్లఁ బెం
పొదవఁగఁ జేసి రూపమునునొందిన నైపుణియోయనంగ స
మ్మదమొదవంగ బంధులకు, భూరియశమ్ము గడించె ధారుణిన్. 30

కం. ఆ మర్యాదా గౌరవ
మా మాటలపొందికయును నా"ఘామేదా"
యీ మేదినిలో రత్నాం
బా మహిళకుఁ దక్క నితరవనితలకున్నే? 31

ఉ. ఎన్నిక గాంచెనెన్నియొ యహీనకులమ్ములు కమ్మవారిలో
నన్నిటిలోన మేటి మరియాదకు మంచికి భూరిదాతృతా
భ్యున్నతికిం బ్రతిష్ఠకు సమున్నతి నంది వెలుంగుఁగాదె యీ
మన్నెకులంబు మేలి తలమానికమై జగతీతలమ్మునన్. 32

కం. ఆ మన్నె కులీనులలో
'హేమాహేమీలు'' వెలసి రింబడరఁగ నా
ధీమంతులలో నెన్నఁగ
మా మన్నె తిరుపతిరాజు మణిపూస సుఁడీ! 33

గీ. మాన్యభూముల క్రోవ నమ్యప్రభావ
జీవనాబ్ధికి నావ క్రొంజివురు తీవ
అమరరాట్పురి తేవ సౌఖ్యాలకోవ
'దేవ' తనజన్మభూమిగఁ దేజరిల్లు. 34

శా. స్వేచ్ఛావాసన లెల్ల నల్లుకొని వాసింపన్ దిశావీథులన్
స్వచ్ఛాంతఃకరణమ్ముతో నధికదీక్షాక్షిప్త భారంబుతో
నాచ్ఛాదించును 'ఖాది' వస్త్రములనే యశ్రాంతమున్ వీడ డీ
యిచ్ఛన్ దిర్పతిరాయఁడెంత తలక్రిందైయైన బ్రహ్మాండముల్. 35

ఉ. చారుతరప్రవర్తనము సంతతసజ్జనగోష్ఠి రాజకీ
యారభటిన్ బ్రియంబుఁదగినంత పరోపకృతిప్రసక్తి యే
పాఱఁగఁదల్లి యానతి నొకప్పుడు దాఁటక మాతృభక్తి యా
కారము దాల్చెనో యనఁగఁగ్రాలును తిర్పతిరాయఁ డున్నతిన్. 36

కం. శరపతి సుడివడెఁగడునడి
సురపతి గిరిగుహలఁదూఱి స్రుక్కెలఁజిక్కెన్
గిరిపతి గిరగిర తిరిగెను
తిరుపతి గాంభీర్య విభవధృతుల కడలు చన్. 37

కం. ధాన్యంబులు పలు తెఱఁగు ల
నన్యాదృశముగ ఫలించినను నేటన్
ధాన్యంబులతో మను వా
ర్ధన్యుఁడు పున్నెములపంట గా దేలఁబోయున్. 38

మ. అతిలోకంబగు దానముల్ సలుపరో యభ్యర్థులం బ్రోవరో
నుతిపాత్రంబగు కైతలం బొగడరో నోరార మాటాడరో
క్షితిలో నెందఱు లేరు ధీరులు గుణశ్రీమంతుఁడౌ బుల్లి తి
ర్పతిరాయాగ్రణి కెందు సాటిగలరే? భావింప సద్భేణులన్. 39

శా. 'జిల్లాబోర్డున' సభ్యుఁడై బహుసమల్ చేదోడువాదోడుగా
నిల్లిగ్గుల్ ఘటియింప కెల్లరకు బంహీయశ్శుభాకాంక్షియై
కల్లల్లాని ప్రవర్తనల్ మెఱయ విఖ్యాతిచ్ఛటల్ బిట్టు వ
ర్తిల్లం జేసెను బుల్లితిర్పతి గుణిశ్రేష్ఠుండు సమ్యగ్విధిన్. 40

ఉ. కైలరు పాఠశాలకు హుటాహుటి వేయి యొసంగుచుం గళా
శాలకుఁగూడ వేయినఁగెఁ జంచదుదారమనీషియై సము
ద్వేలముగా సహాయపడెఁ బెక్కువిధమ్ముల వేలకొద్ది చేఁ
జాలుఁ బరోపకారముల సంహతి తిర్పతిరాయఁడెన్నఁగన్. 41

ఉ. ఆడినమాట తప్పఁడధికారి జనప్రకరానకైనఁ గీ
డాడడు దానధర్మనిచయాచరణ ప్రసరమ్ములందు వె
న్కాడడు తల్లిమాటకెదుగాడ డొకప్డు ను మేటిభాగ్యముల్
గూడిన నుబ్బడింత మదిలో బులితిర్పతిరాయఁడెన్నఁగన్. 42

సీ. తన యేకపత్నీవ్రత ప్రగల్భచరిత్ర
జానకీ పతికి విస్మయము గొలుప
తన దానధారావితానప్రసారంబు
జలధరమ్మునకెగ్గు దలఁచుచుండ
తన సాత్త్వికత్వానై దగ్ధిమహత్వంబు
పారికాంక్షికిఁ దలవంపు నింప
తన మనోహరసంహనన దీప్తిపటలమ్ము
నలకూబరునితోడఁ జెలిమి నెఱప

గీ. తన వినూతనకీర్తి చంద్రకవిఖండ
మండలము దిశా కలితవేదండశౌండ
తుండమండితతిలకమై గండు మెఱయ
మన్నె తిరుపతిరాయ సంపన్నుఁడలరు. 43

చ. స్ఫురదురు సద్గుణంబులొక ప్రోవుగఁజేసి ఘటింప మానఁడే
కొఱఁతయె సుంతయైనఁ దుదకుందలకొట్టుల మూరి బ్రహ్మయం
చఱగొఱ గన్నధాత కొఱఁతన్నది కూర్పక యే సృజించుచుం
దిరుపతిరాయ నిప్పటికిఁ దీర్చుకొనెంగద తొంటి నిందలన్. 44

శా. జిల్లాయెల్లెడఁ గీర్తిచంద్రికలు రాజిల్లంగ వర్తించె నే
యల్లుర్యన్వయ నూరనాఖ్యుఁ డతఁ డత్యంతమ్ముఁ బ్రేమమ్మునై
వాల్లభ్యంబునఁ బెంచుకొన్నసుత బాపాయమ్మలక్ష్మిన్ గరం
బల్లార్చుద్దుగఁ బెండ్లియాడె నిజగార్హస్థ్యంబు శోభిల్లగన్. 45

శా. కాపట్యంబునకున్ దవిష్ఠయగుచున్ గంభీరచిత్తాబ్జయై
యాపద్బాంధవియై సతీచరితయై యాడంబరస్కన్నయై
ప్రాపై సద్గుణరత్నరాజములకున్ భాసిల్లుచున్నట్టి యా
బాపాయమ్మకు నీడు రా రితరశుంభద్రాజ బింబాననల్. 46

కం. రూపంబునకుం బ్రాపై
యేపారు సుగుణమణీ ఘృణీడ్యయగుచు నా
బాపాయమ్మ నిజభవన
దీపాంకురమై యశమ్ము దిక్కుల నించెన్. 47

మ. క్రతుభుగ్భాసురభక్తికి న్నెలవు సత్కార్యైకదీక్షా లస
న్మతికిందావల మప్రమత్తతకు శుంభన్మందిరం బిందిరా
పతిపాదాంబుజ పూజకున్ నిలయమై భాసిల్లు నా జంటకున్
సుత యొక్కర్తుక పుత్రులిద్దరు గుణస్ఫూర్తుల్ పుట్టిరం చద్గుణుల్.

సీ. ప్రఖ్యాత గుణుఁడగు సూర్యనారాయణుండు
అల ప్రభాకర వేంకటాచలము దొరయు
భువి జయంత వసంతులఁబోలు వార
లగ్రసంభవ వారల కాదిలక్ష్మి. 49

గీ. ఆదిలక్ష్మినిఁ బరిణయమాడె ననఘుఁ
డార్యనుతుఁ డతిశాంతుఁ డత్యంత సత్ప్ర
వర్తనుండు నెక్కంటి సద్వంశ జలధి
సోముఁడు జనార్దనుఁడు కళాశోభితుండు. 50

కం. గుణవంతుఁడైన యల్లుఁడు
గుణవంతులు బిడ్డలెల్ల గుణవంతులె యై
గణుతింగను దౌహిత్రులు
గుణికి గుణము లగణితముగఁ గుదురుట యరుదే ! 51

కం. పాతిక యెకరాలను సం
ప్రీతిఁగ భూదానయజ్ఞ పితకు దరిద్ర
త్రాత వినోబాకు నొసఁగె
మా తిరుపతిరాయ డెంత మాన్యుఁడొ జగతిన్. 52

వ. పలికెడి దొక్కపల్కు చెయిపట్టినదొక్క లతాంగి యంచు ది
గ్విలసిత కీర్తిచంద్రికల వెల్గిన శ్రీ రఘురామచంద్రునిన్
దలఁపునకున్ ఘటించు నతి ధార్మికసింహుఁడు మత్కృతీశ్వరుం
డలరుత! వాని వంశతరు వారవి రాత్రిపతారకమ్ముగన్. 53



— షష్ఠ్యంతములు —

కం. ఏవం విధ గుణవంతున
కావిష్కరణీయ వితరణావంధ్యునకున్
దేవాఖ్యాన పురీ సం
జీవదున కజస్రవికచ చిత్తాబ్జునకున్. 54

కం. ఆముష్యాయణునకు గుణ
ధామునకుం బండిత కవితామరస వనీ
భామనిధికి స్వాస్తికునకు
భామా మన్మథున కార్తవర్గాప్తునకున్. 55

కం. అంభస్సారోపమ కీ
ర్త్యంభోధికి శ్రితదరిద్ర తాహార్య బృహ
ద్దంభోళికి సంభావిత
శుంభచ్చారిత్రకునకు శుద్ధాత్మునకున్. 56

కం. స్ఫటికామల భూరియశః
పటలావృత నిఖిల దిగ్విభాగునకున్ వేం
కటరత్నాంబా సుతునకు
ఘటనా ఘటనోద్భటునకు గంభీరునకున్. 57

కం. మన్నెకుల కలశవార్ధ్యు
త్పన్నకుముదబాంధవున కతంద్రునకున్ వి
ద్వన్నుతునకుఁ బ్రశ్రయసం
పన్నునకున్ శ్రీ బులితిరుపతిరాయునకున్. 58

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యాంధ్ర శివానందలహరికిఁ బ్రారంభం బెట్టిదనిన:—



# శ్రీ మన్నె బుల్లితిరుపతిరాయుడు గారి వంశవృక్షము.






శ్రీ

శ్రీ శంకరభగవత్పాద ప్రణీత

# ఆంధ్ర శివానందలహరి



అవతారిక:— శ్రీ శంకరులు పరమేశ్వర నమస్కారము వలన సమస్త పురుషార్థములు లభించుట నెఱింగి సంసార సముద్రమునుండి తాము తరించుటకును ప్రజలను తరింపఁజేయుటకును పరమేశ్వరస్తోత్రము నారంభించుచు నిర్విఘ్నముగా గ్రంథసమాప్తికై పార్వతీపరమేశ్వర రూపమగు మంగళ మాచరించుచున్నారు.

శ్లో. కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతు మే
శివాభ్యా మస్తోకత్రిభువన శివాభ్యాం హృది పున
ర్భవాభ్యామానందస్ఫురదనుభవాభ్యాం నతిరియమ్. 1

టీక:— కలాభ్యాం = మహావిద్యాస్వరూపులును, చూడాలంకృత = శిఖలచే నలంకరింపఁబడిన, శశికలాభ్యాం = చంద్రరేఖలు గలవారును, నిజతపః = ఒకరి కొకరు తమతమ నిరాహారాది వ్రతములయొక్క, ఫలాభ్యాం = ఫలమైనవారును, భక్తేషు = భక్తులయందు, ప్రకటిత = చూపఁబడిన, ఫలాభ్యాం = కర్మఫలములుగల వారును, అస్తోక = కొలఁదిగేని, త్రిభువన = ముజ్జగములయొక్క, శివాభ్యాం = శుభములు గలవారును, హృది = మనస్సునందు, పునర్భవాభ్యాం = మరల మరల తోచుచుండువారును, ఆనంద = పరమానందములోఁగూడ, స్ఫురత్ = తోచుచుండెడు, అనుభవభ్యాం = స్వరూపసాక్షాత్కారము గలవారనగు, శివాభ్యాం = పార్వతీపరమేశ్వరుల కొఱకు, ఇయం = ఈ, మే = నాయొక్క, నతిః = నమస్కారము, భవతు = అగుఁగాక.

తాత్పర్యము:— తమలో తాముచేసిన తపస్సుచేత నొకరి కొకరు ఫలముగా అర్ధనారీశ్వరమూర్తులై సకలలోకములకు శుభదాయకులై కర్మఫలప్రదాయకులై భక్తులు ధ్యానము చేయుపట్ల నిమిషనిమిషమునను వారల హృదయములయం దావిర్భ

వించుచు ముముక్షువుల కానంద సాక్షాత్కారముల నొసంగుచు సమస్త విద్యా స్వరూపులైయున్న యీ పార్వతీపరమేశ్వరులకు నమస్కారము.

మ. కలితాత్మీయ తపఃఫలుల్, ధృతకళుల్ గ్లౌశేఖరుల్, లెంకదం
టలభాగ్యమ్ములు, సర్వలోక శివులానందానుభూతి స్వరూ
పులు, ధ్యానింప హృదింబునర్భవతః బెంపుంజూపు సన్మూర్తు లా
ద్యులునై యొప్పనుమామహేశులకిదే దోయిళ్ళు సంధించెదన్.

అవః— శివానందము తన చిత్తము నెడబాయకుండ వేడుకొనుచున్నారు.

శ్లో. గళంతీ శంభో త్వచ్చరితసరితః కిల్బిషరజో
దళంతీ ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్
దిశంతీ సంసారభ్రమణపరితాపోపశమనం
వసంతీ మచ్చేతో హ్రదభువి శివానందలహరీ. 2

టీక:— హే శంభో = సుఖమునకు కారణమైనవాఁడా ! త్వత్ = నీయొక్క, చరిత = చరిత్రమనెడు, సరితః = నదినుండి, గళంతీ = స్రవించి పాఱుచున్నదియు, కిల్బిష = పాపములనియెడు, రజః = ధూళిని, దళంతీ = ఖండించుచున్నదియు, ధీ = బుద్ధులనియెడు, కుల్యా = పిల్లకాలువలయొక్క, సరణిషు = త్రోవలయందు, పతంతీ = ప్రసరించుచున్నదియు, సంసారభ్రమణ = జననమరణరూపమైన సంసార చక్రమందు తిరుగుటచే కల్గిన, పరితాప = అధిక సంతాపములయొక్క, ఉపశమనం = ఉపశాంతిని, దిశంతీ = ఇచ్చుచున్నదియు, మత్ = నాయొక్క, చేతః = చిత్తమనియెడు, హ్రదభువి = మడుగునందు, వసంతీ = నిలిచియుండునదియునగు, శివానందలహరీ = పార్వతీపరమేశ్వరుల వలన గలిగిన యానందప్రవాహము, విజయతాం = సర్వోత్కృష్టముగా నుండుగాక.

తా:— ఓ శంకరా! నీ చరిత్రములు మహానదులు. వానినుండి స్రవించి పాఱును పాపము లనెడు ధూళుల నణచుచున్న యీ శివానందలహరి బుద్ధియను పిల్లకాలువ గుండ వచ్చి సంసార తాపము నణంచుచు నా హృదయమను పెద్ద చెఱువులో పడినది. ఇది యిక నెన్నడును వీడకుండ స్థిరముగానుండు నట్లనుగ్రహింపుము.

ఉ. విందిదు నీకథానదిని వెల్వడి పాపరజమ్ము నూడ్చి ని
స్తంద్ర మతిప్రసారణుల దారులఁజొచ్చి భవోగ్రతాపముక్
ప్రమందగఁజేసి డెందమను మడుగునిల్చి, యజస్రముక్ శివా
నంద ఝరీవరమ్ము శ్రితనందనమై వెలుఁగొందుఁ గావుతక్. 2

అవ:— శివానంద నిలయము శివభజన చేయనిదే కలుగదుగాన శివభజన మావశ్యకమని సూచించుచున్నారు.

శ్లో. త్రయీవేద్యం హృద్యం త్రిపురహరమాద్యం త్రినయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివ మతివిడంబం హృదిభజే. 3

టీక:— త్రయీ = ఋగ్యజుస్సామవేదములు మూటిచేతను, వేద్యం = తెలిసి కొనఁదగినవాఁడును, హృద్యం = మనఃపద్మమున వ్యక్తమగువాఁడును, త్రిపురహారం = స్థూలసూక్ష్మకారణ శరీరములు మూఁటిని నశింపఁజేయువాఁడును, ఆద్యం = సృష్టి కంతకు మొదటను యున్నవాఁడును, త్రిణయనం = మూఁడుకన్నుల వాఁడును, జటాభారోదారం = జటాజూటముచేత గంభీరమైనవాఁడును, చలత్ = కదలుచున్న, ఉరగ = పాముల నెడు, హారం = పేరులుగలవాఁడును, మృగధరం = లేడిని ధరించిన వాఁడును, మహాదేవం = గొప్పదేవుఁడును, దేవం = ఆనందస్వరూపుఁడును, మయి = నాయందు, సదయభావం = దయతోకూడిన అభిప్రాయముగలవాఁడును, పశుపతిం = బ్రహ్మాదిలోక పాలకుఁడును, చిదాలంబం = స్వరూపజ్ఞానమునకు సాధన మైనవాఁడును, అతివిడంబం = సమయానుసరణము గలవాఁడును, సాంబం = పార్వతీ సమేతుండునగు, శివం = పరమేశ్వరుని, హృది = మనస్సునఁ, భజే = సేవింతును.

తా:— ఏ మహాదేవుఁడు వేదత్రయమందు తెలియఁబడునో, ఏ మహాదేవుఁడు హృదయపద్మమునందు స్ఫురించునో, ఏ మహాదేవుఁడు స్థూలసూక్ష్మకారణ శరీరములు మూఁటిని నిర్మూలించునో, ఏ మహాదేవుఁడు సృష్టికి పూర్వమందును గలఁడో, ఏ మహాదేవుఁడు మూఁడుకన్నులును, జటాజూటమును, సర్పహారమును, చేతలేడియుఁ గల్గి గంభీరమూర్తియై యొప్పునో, ఏ మహాదేవుఁడు స్వప్రకాశము పరమానందమును స్వస్వరూపముగా వెలుఁగొందునో, ఏ మహాదేవుఁడు స్వరూపసాక్షాత్కారమునకు

ముఖ్యసాధనమో, ఏ మహాదేవుఁడు సకలలోకములకు పరిపాలకుఁడై లోకానుకరణముతోఁగూడి వర్తించునో అట్టి పార్వతీ సమేతుండగు పరమేశ్వరుని సేవింతును.

గీ. ఆద్యు, శ్రుతివేద్యు, హృద్యు, భాలాక్షు, దక్షు
హరు, జటోదారు, మృగధరు, నురగహారు
శివుఁ జిదాలంబు, సాంబు, నాశ్రితకృపాళు
భవు, మహాదేవు, నినుగొల్తుఁ బార్వతీశ ! 3

అవ:— దేవతలందరిలోను శివుఁడు సర్వోత్తముఁడని తలంచి నీ పాదారవింద భజన మనుగ్రహింపుమని యాతని నే వేఁడుకొనుచున్నారు.

శ్లో. సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా
న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్
హరిబ్రహ్మాదీనామపి నికటభాజామసులభం
చిరం యాచే శంభో శివ తవపదాంభోజ భజనమ్.

టీక:— జగతి = లోకమునందు, క్షుద్రఫలదాః = తుచ్ఛమైన ఫలముల నొసగునట్టి, విబుధాః = ఇతరదేవతలు, సహస్రం = వేలకొలంది, వర్తంతే = ఉన్నారు, అహం = నేను, స్వప్నేవా = స్వప్నమందైనను, తదనుసరణం = ఆ దేవతలను భజించుటగాని, తత్కృతఫలం=ఆ దేవతలు గలుగఁజేయు ఫలమునుగాని, నమన్యే= తలంపను, శంభో, శివ = సుఖకారణుడవును, మంగళస్వరూపుడవునగు శంకరా, నికటభాజాం = సమీపమును చేరియున్న, హరిబ్రహ్మాదీనామపి = విష్ణువు, బ్రహ్మ మొదలగువారికి సైతము, అసులభం = దుర్లభమైన, తవ = నీయొక్క, పదాంభోజ భజనమ్=పాదపద్మముల సేవను, చిరంయాచే = ఎల్లప్పుడును యాచించుచున్నాను.

తా:— కొంచెము కొంచెము ఫలమిచ్చు దేవతలెందఱో కలరు. వారిసేవ వారిచ్చు ఫలములు నాకు కావలయునను కోరిక కలనైనలేదు. శంకరా! ఎల్లప్పుడును సమీపవర్తులైన బ్రహ్మాదులకుఁగూడ దొరకని మీ పాదసేవయే దయచేయుఁడు. మిమ్ము ఎల్లవేళల వేడుకొనుచున్నాను.

చ. కొలఁదిగ నిచ్చు వేలుపులు కోట్లకొలంది గలారు; వారలం
గొలుచుటనో ఫలంబు మదిఁ గోరనొకప్డును; నీకు నాప్తులై

మెలఁగు విరించి విష్ణులకె మిక్కిలి దుర్లభమా భవన్మహో
జ్జ్వలపద పంకరుడ్భజన భాగ్యమె కోరెదనయ్య శంకరా ! 4

అవ:- ఎన్నడో ఫలమిచ్చు నీ దేవతలతో నీకేల ? ఇంతకంటె నొక రాజు నాశ్రయించరాదా ? ప్రత్యక్షముగా వెంటనే ఫలమిచ్చును. అది మెలుగు గాదా యను నభిప్రాయమును మనస్సు నందుంచుకొని యిట్లు చెప్పుచున్నారు.

శ్లో. స్మృతౌ, శాస్త్రే, వైద్యే, శకున కవితాగాన ఫణితౌ
పురాణే, మంత్రేవా, స్తుతి నటన హాస్యేష్వచతురః
కథం రాజ్ఞాం ప్రీతిర్భవతి మయి కోఽహం పశుపతే
పశుం మాం సర్వజ్ఞ ప్రథితకృపయా పాలయవిభో.

టీక:- స్మృతౌ = స్మృతులయందుఁగాని, శాస్త్రే = శాస్త్రములయందుఁగాని, వైద్యే = వైద్యమునందుఁగాని, శకున=శకునములు చెప్పుటయందుఁగాని, కవితా = కవిత్వమునందుఁగాని, గానఫణితౌ = సంగీతముపాడి రంజింపచేయుట యందుఁగాని, పురాణే=పురాణములు చెప్పుటయందుఁగాని, మంత్రేవా=మంత్రశాస్త్రమందుఁగాని, స్తుతి=పొగడ్తలయందుఁగాని, నటన = నాట్యమునందుఁగాని, హాస్యేషు=హాస్యములు చెప్పుటయందుఁగాని, అచతురః = నేర్పులేనివాఁడను, మయి = ఇట్టి నాయందు, రాజ్ఞాం = రాజులకు, ప్రీతిః = ప్రేమ, కథం = ఎట్లు ? భవతి = కలుగును, కనుక, ప్రథిత = వేదప్రసిద్ధుడవును, సర్వజ్ఞ = సమస్తము తెలిసినవాఁడవునగు, హే పశుపతే = ఓ పరమేశ్వరా! కోఽహం = నేనెవ్వఁడనో యెఱుఁగని, పశుం = పశుప్రాయుఁడనైన, మాం = నన్ను, కృపయా = దయతో, పాలయ = రక్షింపుమా !

తా:- సర్వజ్ఞుఁడవైన యీశ్వరా ! శాస్త్రపాండిత్యములేదు. వైద్యము చేయుట చేతగాదు. కవిత్వము చెప్పలేను. సంగీతమురాదు. పురాణము చెప్పలేను. మంత్రము తెలియఁగను. ఆటపాటలయందు నేర్పులేదు. హాస్యము చెప్పలేను. ఇట్టి నాయెడ రాజులకెట్లు దయగల్గును. వారిచ్చు ఫలముల నాకేల? వేదవేద్యా! నన్ను నేనే యెఱుఁగని పశువను. నీవు పశుపతివి గనుక నన్ను దయతో రక్షింపుము.

మ. స్మృతులన్, శాస్త్రములన్ సువైద్యకవితా సిద్ధాంతగానమ్ములం
దితిహాస, స్తుతి, మంత్ర, హాస్యకలనా నృత్యంబులందేనిఁ బ్రౌ

ఖత లేదింతయునాకు; రాజులికనం డంజేర్తురే నన్ను, నా
ధృతి సర్వజ్ఞ! పశున్ ననుం గరుణ సంధిల్లంగఁ గావంగదే! 5

అవ:– ఇట్లు దేవుని వేడికొని తన బుద్ధిని గుఱించి నీ యలవాటు చొప్పున సామాన్యమైన శాస్త్రముల మీదికే పరుగులెత్తెదవు. అది దురభ్యాసము సుమా! ఇంకమాని శివభజన చేయుమని మెల్లగా నందుఁ జొప్పించుచున్నారు.

శ్లో. ఘటో వా మృత్పిండోఽప్యణురపి చ ధూమోఽగ్నిరచలః
పటో వా తంతుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్,
వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభోర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః

టీక:– సుధీః = ఓ మంచిబుద్ధీ! ఘటోవా = కుండగానీ, మృత్పిండోఽపి = మట్టిముద్దగానీ, అణుఃఅపి = పరమాణువుగానీ, ధూమః = పొగగానీ, అగ్నిః = నిప్పుగానీ, అచలః = పర్వతముగానీ, పటోవా = వస్త్రముగానీ, తంతుర్వా = దారముగానీ, ఘోరశమనం = భయంకరుఁడైన యముని, పరిహరతికిం = పోగొట్టునాయేమి? తర్కవచసా = పైనిచెప్పిన తర్కశాస్త్రమునందలి మాటలచే, వృథా = వ్యర్థముగా, కంఠక్షోభం = కంఠమున కాయాసమును, వహసి = కలిగించుకొనుచున్నావు; శంభోః = శివునియొక్క, పదాంభోజం = పాదపద్మమును, భజ = సేవింపుము, తరసా = శీఘ్రముగా, పరమసౌఖ్యం = మోక్షసామ్రాజ్యమును, వ్రజ = పొందుము.

తా:– కుండలుచేయుటకు మట్టి సాధనము. దానికి పరమాణువులు కారణము. కొండమీద పొగ అగపడుచున్నది కాన నిప్పక్కడ ఉండును. బట్టలు దారముల వలన కలుగును. ఈ మొదలగు తర్కశాస్త్ర వాక్యములలో నొక్కటియుఁగూడ మృత్యువున కడ్డుపడునదికాదు. ఇవి పిడివేసి వల్లించి కంఠక్షోభ మేల కలిగించుకొనెదవు? శివభజనచేసి మోక్షమును పొందుము.

చ. ఘటము, మృదుచ్చయం, బణువు గ్రావము, ధూమము, వహ్ని,
తంతువుం బటము నటన్న తర్కవచన ప్రతివాదము కంఠశోషనే
ఘటియిలఁజేయుఁగాని యమ కాలుని గెంట దొకప్పుఁగాన ధూ
ర్జటి పదముల్ భజించి స్థిర సౌఖ్యము నొందుము ధీమదగ్రణీ! 6

అవ:— బుద్ధిని శివభక్తియందుఁజొన్పి మనస్సు మొదలగు నింద్రియములకుఁ గూడ నితర విషయాశక్తి లేకుండ పరమ శివకైంకర్యాసక్తి గలుగునట్లు వేడు చున్నారు.

శ్లో. మనస్తే పాదాబ్జే నివసతు వచస్స్తోత్రఫణితౌ
కరశ్చాభ్యర్చాయాం శ్రుతిరపి కథాకర్ణనవిధౌ,
తవ ధ్యానే బుద్ధిర్నయనయుగళం మూర్తివిభవే
పరగ్రంథాన్కైర్వా పరమశివ జానే పరమతః॥

టీక:— హే పరమశివ = ఓ పరమేశ్వరా! మనః = మనస్సు, తే = నీయొక్క, పాదాబ్జే = పాదపద్మమందును, వచః = వాక్కు, స్తోత్రఫణితౌ = స్తోత్రపాఠములు చదువుటయందును, కరః = చేతులు, అభ్యర్చాయాంచ = పూజయందును, శ్రుతిం= చెవులు, కథాకర్ణనవిధౌ = చరిత్రలు వినుటయందును, బుద్ధిః = బుద్ధి, తవ = నీ యొక్క, ధ్యానే = ధ్యానమునందును, నయనయుగళం = కన్నుదోయి, మూర్తి విభవే = నీ దివ్యమంగళ విగ్రహముయొక్క చక్కదనమందును, నివసతు = స్థిరపడి యుండుగాక ! అతఃపరం = ఇంకమీఁద, కైర్వా = ఏ యింద్రియములచేత, పర గ్రంథాన్=నీ కైంకర్యమునకు వ్యతిరిక్తములైన గ్రంథములను, జానే= తెలిసికొందును.

తా:— మనస్సు, వాక్కు, హస్తము, శ్రవణము, బుద్ధి, నేత్రము, అను నిందిృయములు సర్వకాల సర్వావస్థలయందు నీ కైంకర్యములందే మునిఁగియున్నచో గ్రంథాంతర ప్రసక్తి కలుగదు. కనుక అట్లనుగ్రహింపుమని భావము.

చ. మనము భవత్పదాబ్జమున, మాట భవన్నుతియందు, హస్త మ
ర్చనమున, వీను నీకథల సంశ్రవణమ్మునఁజూడ్కి మూర్తి ద
ర్శనమున, బుద్ధి ధ్యానమున జానగుఁగావుత నాకు నంత క
న్నను నితరమ్ముఁజూచుటకు నాకుఁ దరంబెటులింక శంకరా! 7

అవ:— నన్ను భజించుటచేతనే సకలాభీష్టములు సిద్ధించునెడల కొందఱి తరులనేల సేవింతురను ప్రశ్నయం దిట్లు చెప్పుచున్నారు.

శ్లో. యథా బుద్ధిశ్శుక్తౌ రజతమితి కాచాశ్మని మణి
ర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్,

తథా దేవభ్రాంత్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే॥

టీక:— మహాదేవ = ఓ దేవదేవుఁడా! పశుపతే = సకల భూతాధిపతీ, జడ జనః = మూఢుఁడు, ఈశం = సర్వనియంతవగు, త్వాం = నిన్ను, మనసి = హృదయమందు, నమత్వా = తలఁపక, శుక్తౌ = ముత్యపుచిప్పయందు, రజతమితి = వెండియనియు, కాచాశ్మని = గాజురాయి యందు, మణిః = మాణిక్యమనియు, పైష్టే = పిండికలిపిన, జలే = నీటియందు, క్షీరం = పాలనియు, మృగతృష్ణాసు=ఎండమావుల యందు, సలిలం = జలమనియు, బుద్ధిః = మిథ్యాబుద్ధి, యథా = ఎట్లు, భవతి = కలుగుచున్నదో, తథా = అట్లు, భవదన్యమ్ = నీకంటె నితరుఁడైనట్టి వానిని, దేవ భ్రాంత్యా = దేవుఁడను భ్రాంతిచేత, భజతి = సేవించుచున్నాఁడు.

తా:— ముత్యపుచిప్పలను వెండియనియు, గాజురాళ్ళను మణులనియు, పిండి నీళ్ళను పాలనియు, ఎండమావులను నీళ్ళనియు భ్రమించునట్లుగా నిన్ను తెలియ నేరని మనుజుఁడు ఇతరుని దేవునిగా భ్రమించి సేవించుచున్నాఁడు.

గీ. శుక్తి రజతమ్ము మరుమరీచులు జలమ్ము
గాజు రత్నమ్ము పైష్టోదకమ్ము పాలు
నని భ్రమించెడు పోల్కి జడాత్ముఁ డన్యు
దేవుఁడని మ్రొక్కు నిను మహాదేవుఁ దొరఁగి. 8

అవ:— ఏ యుపాయముచే నైనను ఈశ్వరప్రసాదము సంపాదింపవలయునని చెప్పియున్నది. అందు సులభోపాయము చెప్పుచున్నారు.

శ్లో. గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః,
సమర్ప్యైకం చేతస్సరసిజముమానాథ భవతే
సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో!

టీక:— జనః = మనుష్యుఁడు, జడమతిః=తెలివితక్కువవాఁడై, కుసుమార్థం= పుష్పముల కొఱకుగా, గభీరే = లోఁతైన, కాసారే = చెఱువునందు, విశతి = దిగుచున్నాఁడు, విజనే = జనులులేని, ఘోరవిపినే = భయంకరారణ్యము నందును,

విశాలే=విస్తీర్ణమైన, శైలేచ = పర్వతమందును, భ్రమతి = తిరుగుచున్నాడు, హే ఉమానాథ = ఓ శంకరా! ఏకం = ఒక్క, చేతస్సరసిజం = మనస్సనెడు పద్మమును, భవతే=నీకొఱకు, సమర్ప్య = సమర్పించి, ఇహ = ఇచ్చట, సుఖేన = సుఖముగా, అవస్థాతుం = స్థిరుడై యుండుటకు, నజానాతి = ఎఱుంగడు, కిమహో = ఏమి యాశ్చర్యము !

తా:- మానవులెంత వెఱ్ఱివాండ్రు. పుష్పములకొఱకు తా మడవులలోను, కొండలలోను తిరుగులాడుచు లోతైన చెఱువులలో నీఁదులాడుచు చిక్కులు పడుచున్నారు. తమతమ మనస్సను పద్మమును పరమేశ్వరుని పాదారవిందములయందు అర్పించినయెడల నెంత సుకరముగా నుండును ?

మ. నిను నర్పించుటకై జడుండు విరులం దేఁగోరి లోతైన చె
రువ్వనకుం బర్వులు వాఱు, దుర్గమవనీ భూమీధ్ర వీధిం జరిం
చు నహో! కానఁడుగాని మానస సరస్సూనంబు నీ కిచ్చినం
జన దే! దాన నఖండ సౌఖ్యమిటనే సంధిల్ల దే శంకరా ! 9

అవ:- ప్రాగ్భవకర్మవశముచే నే జన్మము వచ్చినను రానిమ్ము కాని అన్ని జన్మములందు నీ పాదారవింద స్మరణము మాత్రము కల్గునట్లనుగ్రహింపుము. అట్లయినఁగదా చిత్తమును భవదాయత్తము చేయఁగల్గుదునని ప్రార్థించుచున్నాడు.

శ్లో. నరత్వం దేవత్వం నగవనమృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాదిజననమ్,
సదా త్వత్పాదాబ్జస్మరణపరమానందలహరీ
విహారాసక్తం చేద్ధృదయమిహ కిం తేన వపుషా?

టీక:- నరత్వం = మనుష్యుఁడు గాఁగానీ, దేవత్వం=దేవుఁడు గాఁగానీ, నగ= పర్వతము గాఁగానీ, వన = అడవిగాఁగానీ, పశుత్వం = పశువు గాఁగానీ, కీటత్వం = పురుగుగాఁగానీ, విహగత్వాది = పక్షులు మొదలగునవి గాఁగానీ, జననం = పుట్టుక, భవతు = అగుఁగాక, హృదయం = మనస్సు, ఇహ = ఈ పై జన్మములయందు, సదా = ఎల్లప్పుడు, త్వత్ = నీయొక్క, పాదాబ్జ=పాదపద్మములయొక్క, స్మరణ= స్మరించుటయనెడు, పరమానంద = మహానందముయొక్క, లహరీ = ప్రవాహమందలి, విహార = విహరించుటకు, ఆసక్తం = ఆసక్తిగలిగినది, భవతిచేత్=అగునేని, తేన = ఆ, వపుషా = శరీరముచేత, కిం = ఏమిభంగము ?

తా:— మనస్సు పరమేశ్వర స్మరణము గలదై శివానందలహరి యందు ఓలలాడుచున్నచో నే జన్మమెత్తినను కొదువలేదని తాత్పర్యము.

మ. నరుఁడో, దేవుఁడో, కీటమో, పశువో, యండప్రోద్భవంబో మహీ
ధరమో, భూజమొ యేదొయొక్కఁడగుఁగాతన్ మేనితో నేమి? ఈ
శ్వర! చిత్తమ్ము నిరంతరమ్మును భవత్పాదాంబుజ ద్వంద్వ సం
స్మరణానంద ఝరీవిహారపరతన్ జానొందినం జాలదే! 10

అవ:— ఇట్లే జన్మమెత్తినను విఘాతములేదని చెప్పి చిత్త మీశ్వరాయత్తము గాక వర్ణాశ్రమాది ధర్మములెన్ని చేసినను నిష్ఫలమని చెప్పుచున్నారు.

శ్లో. వటుర్వా గేహీ వా యతీరపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చిద్భవతు భవ కిం తేన భవతి,
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే
తదీయస్త్వం శంభో భవసి భవభారం చ వహసి.

టీక:— నరః = మానవుఁడు, వటుర్వా = బ్రహ్మచారియైనను, గేహీవా = గృహస్థైనను, యతిరపి = సన్యాసియైనను, జటీవా = జటధారియైనను, తదితరః, యః, కశ్చిత్ = మఱియింక నెట్టివాఁడైనను, భవతు = కానిమ్ము, తేన = అందుచేత, హే భవ = ఓ యీశ్వరా! కింభవతి = ఏమియగును ? పశుపతే = సకలభూతనాయకా ! యదీయం = ఎవని సంబంధమైన, హృత్పద్మం = హృదయకమలము, భవదధీనంయది = నీ యధీనమైనదిగానుండునో, తదీయః = వాని సంబంధుఁడవుగా, త్వం = నీవు, భవసి = అగుదువు, హే శంభో = ఓ శఙ్కరా ! భవభారంచ = వాని సంసార భారమును, వహసి = నీవే భరింతువు.

తా:— ఏయే వర్ణముల యందున్నను, ఏ యాశ్రమమందున్నను, ఎన్నెన్ని జడలు పెంచుకొన్నను ఎంతవాఁడైనను సరే ఈశ్వరభక్తి లేనిదే లాభమిసుమంతయు లేదు. హృదయపద్మమునందు నిన్ను ధ్యానించుచు మనస్సు నీయం దర్పించి భజించు వానికి సంబంధివై వాని భారమంతయు నీపై వేసికొని కాపాడుదువు.

గీ. వటువో? గేహియొ? జటియొ? యెవ్వండొ యొక్కఁ
డగును గాక నరుండె వండైననేమి?

యెవని హృదయంబు నీయందుఁ దవులు వడునొ?
వాని వాఁడవు తద్భారవహుఁడ వీశ! 11

అవ:— ఇట్లు వర్ణాశ్రమాదులకన్న శివభక్తి యుత్తమంబని చెప్పి పర్వత గుహాదుల యందలి నివాసము కన్నను శివభక్తియే మేలని చెప్పుచున్నారు.

శ్లో. గుహాయాం గేహే వా బహిరపి వనే వాఽద్రిశిఖరే
జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్,
సదా యస్యైవాంతఃకరణమపి శంభో తవ పదే
స్థితం చేద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ.

టీక:— గుహాయాం = కొండగుహయందో, గేహేవా = స్వగృహమందో, బహిరపి = బయటనెచ్చటనో, వనేవా = అడవియందో, వహ్నౌవా=అగ్నియందో, వసతు = నివసించుఁగాక, హే శంభో = సుఖకరుండవగునో యీశ్వరా! వసతేః = అట్లు నివసించిన మాత్రమున, కింఫలమ్ = ఏమిఫలమో, వద = చెప్పుము, యస్య= అట్టివానియొక్క, అంతఃకరణమపి = మనస్సుకూడ, సదా = ఎల్లప్పుడును, తవ = నీయొక్క, పదేఏవ = పాదమందే, స్థితంచేత్ = నిలచియున్నచో, అసౌ = ఇట్లు నిలుచుటచే, యోగః = శివయోగము, సచ = అట్టివాఁడే, పరమయోగీ = నిర్వికల్ప సమాధిగల పరమయోగియు, సచ = వాఁడే, సుఖీ=పరమానందముగల వాఁడునగును.

తా:— పర్వతగుహలు, అరణ్యములు మొదలగు వానియందు నివాసము చేసి నంత మాత్రమున ఫలమేమియులేదు. అంతఃకరణముగూడ నీశ్వరధ్యానమునందు చొన్పి తదేక నిష్ఠాగరిష్ఠుడై యున్నచో శివయోగియై పరమానందము నొందును.

ఉ. ఇంటనొ, కాననొ, గుహనొ, యేటనొ, వహ్నినొ, కాక బైటనొ
యొంటిగ నిల్చు మాత్ర ఫలమున్నె? మనంబు నెవండు నీపద
మ్మంటఁగ నిల్పనోపు ననయమ్మును నయ్యదె యోగ మాతఁడో
బంటగు యోగి, వాఁడె సుఖి వాఁడె కృతార్థుఁడు చంద్రశేఖరా!

అవ:— అట్టివాడను కాలేకయున్న నన్ను జ్ఞానమొసంగి రక్షించుట నీ భారమై యున్నదని చెప్పుచున్నారు.

శ్లో. అసారే సంసారే నిజభజనదూరేఽజడ ధియా
భ్రమంతం మామంధం పరమకృపయా పాతుముచితమ్,
మదన్యః కో దీన స్తవ కృపణరక్షాతినిపుణః
త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే.

టీక:— హే పశుపతే = ఆత్మజ్ఞానమును పాలించు శంకరా! అజడ = జడము లైన దేహాదులకన్న విలక్షణమైన, పరమ = ఓ పరాత్పరా! అసారే = సారము లేనిదియు, నిజభజనదూరే = ఆత్మానుసంధానము దూరమైనదియునగు, సంసారే = సంసారమందు, భ్రమంతం = కొట్టుకొనుచున్నట్టియు, అంధం = గ్రుడ్డివాఁడనై నట్టియు, మాం = నన్ను, కృపయా = దయతో, ధియా = స్వరూపజ్ఞానమునిచ్చుటచేత, పాతుం = రక్షించుటకు, ఉచితం = యుక్తము, దీనః = సంసారతాపముచేతదీనుఁడైన, మదన్యః = నాకంటె మరియొకఁడు, తవ = నీకు, కః = ఎవఁడున్నాఁడు? కృపణ రక్షాతి నిపుణః = దీనులను రక్షించుటయందు మిక్కిలి నేర్పుగలవాఁడును, మే = నాకు (నన్ను) శరణ్యః = రక్షింపఁదగినవాఁడు, త్వదన్యః = నీకంటె మఱియొకఁడు, త్రిజగతి = ముల్లోకములందును, కః = ఎవఁడున్నాఁడు?

తా:— దేవా! ముల్లోకములందును దీనరక్షాపరుండవు నీ వొక్కఁడవే గలవు. నేనును సంసార తాపములను సహింపలేక దీనుండనై నీవే దిక్కుగా నీ పాలఁబడి యున్నాను. నావంటి దీను లింకెందును కానరారు. కనుక దయచూపి ఆత్మజ్ఞాన మొసఁగి యీ దీనుని సంసారతాపములనుండి రక్షింపుము.

చ. జడతను గ్రుడ్డినై పరమ సంవిదపేతము సారహీనమై
మిడుకు భవాబ్ధిఁబడ్డ నను మేలుగ నేలుము దీనరక్షణా
ధ్యుఁడవగు నీవు దక్క మఱి యొక్కఁడు దిక్కెవఁడయ్య నాకు న
న్గడచిన దీనుఁడెవ్వఁడిక నాగవిభూషణ! నీకుఁ జిక్కెడున్. 13

అవ:— వేదశాస్త్రముల నుల్లంఘించుటచేత నా యాజ్ఞ మీఱితివి. కాన నీ వపరాధివి. నన్ను రక్షించుట యెట్లందువేమో? నీ వాఁడను గనుక నా తప్పు క్షమింపు మనుచు బాంధవ్యమును చూపుచున్నారు.

శ్లో. ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే
ప్రముఖ్యోఽహం తేషామపికిముత బంధుత్వమనయోః,

త్వయైవ క్షంతవ్యాః శివ మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవనమియం బంధుసరణిః.

టీక:— హే పశుపతే = ఓ పరమేశ్వరా! త్వం = నీవు, ప్రభుః = దైన్యమును పోఁగొట్టుటకు సమర్థుఁడవు గనుకనే, దీనానాం = దీనులకు, పరమబంధుఃఖలు=ముఖ్య బంధుఁడవుగదా! అహం = నేను, తేషాం = ఆదీనులలో, ప్రముఖ్యః= మొట్టమొదటి వాఁడను, అనయోఃఅపి = ఇట్టి మనకును, బంధుత్వం = చుట్టరికము, కిముత=ఉన్న దని చెప్పవలయునా ? శివ = ఓ ఆనందస్వరూపుఁడా ! సకలాః = సమస్తమైన, మదపరాధాః = నాతప్పులు, త్వయైవ = నీచేతనే, క్షంతవ్యాః = క్షమింపఁదగినవి, మత్ + అవనం = నారక్షణము, ప్రయత్నాత్=ప్రయత్నమువలన, కర్తవ్యం=చేయఁ దగినది, ఇయం = ఇది, బంధుసరణిః = బంధుమర్యాద.

తా:— ఓ దేవా! నీవు దీనబంధుఁడవు. నేను దీనుఁడను. ఇఁక మనకు బాంధ వ్యము గలదని వేఱె చెప్పనక్కఱలేదుగదా ! కనుక నా తప్పులన్నియు మన్నించి తప్పక నన్ను నీవే కరుణించి రక్షింపవలసి యున్నది. ఇదియేకదా బంధువుల పద్ధతి.

ఉ. ఈవు ప్రభుండ వార్తజన బృంద సుబంధుఁడ వట్టివారిలో
భావనసేయ నేను తొలివాఁడ, క్షమింపుము మత్కృతాపరా
ధావళి నెల్ల, బాంధవుఁడ వౌట మఱేటికిఁ బల్క నాదుర
క్షావిధి నీకు దీక్షయగుఁగాదె తలంపఁగఁ బార్వతీపతీ ! 14

అవ:— ఈశ్వరుఁడు తన్నుపేక్షించునేమో యని యట్లు కాకుండఁ జెప్పు చున్నారు.

శ్లో. ఉపేక్షా నోచేత్కిం న హరసి భవద్ధ్యానవిముఖాం
దురాశాభూయిష్ఠాం విధిలిపిమశక్తో యది భవాన్,
శిరస్తద్వైధాత్రం ననఖలు సువృత్తం పశుపతే
కథం వా నిర్యత్నం కరనఖముఖేనైవ లులితమ్ ?

టీక:— పశుపతే = సర్వలోకాధీశ్వరా! ఉపేక్షానోచేత్ = (నన్ను రక్షించుట యందు నీ కుపేక్షకలదేమో) అట్లుపేక్ష లేనిచో, దురాశాభూయిష్ఠాం = దుష్టములైన తలంపులతో నిండినదియు, భవత్ ధ్యానవిముఖాం = నీ ధ్యానమునుండి పరాఙ్ముఖ

మైనదియు, విధిలిపిం = బ్రహ్మవ్రాఁతను, కిం నహరసి = ఎందుకు తుడిచివేయవు ? భవాన్ = నీవు, అశక్తోయది = అశక్తుఁడవేని, ననఖలు = గోటితో త్రుంచనలవికాని, తత్ = ఆ, సువృత్తం = మిక్కిలి దృఢమైన, వైధాత్రం = బ్రహ్మసంబంధమైన, శిరః = ఐదవశిరస్సును, నిర్యత్నం = ప్రయత్నమక్కఱలేకుండ, కరనఖముఖేనైవ= చేతిగోటి కొనచేతనే, కథంవా = ఎట్లు, లులితం = త్రుంచివేయఁబడినది ?

తా:- సాంబశివా! దరిద్రులకును నిన్ను ధ్యానించుటయందు ఆసక్తి లేమికిని సూచకముగా నా నుదుట బ్రహ్మవ్రాసిన వ్రాఁతను ఉపేక్షింపక తుడిచివేయుము. నా చేతఁగాదని తప్పించుకొనుటకు వీలులేదు. ఆ బ్రహ్మదేవుని ఐదవ తలను కొనగోటితోనే త్రుంచితివిగదా !

మ. భవదీయస్మరణ క్రియావిముఖమై స్వామీ! దురాశా మహో
భవనంబై తగు బ్రహ్మవ్రాఁతను తొలంప న్నీవుపేక్షింపఁ గాఁ
దవునే? చాలవయేని పూర్వమెటు తద్వైధాత్ర శీర్షంబు నీ
వవలీలం గొనగోట గిల్లితివొ శర్వా! తెల్పు మాలించెదన్. 15

అవ:- భక్తుఁడు దీనసంరక్షకుఁడవగు నీ కటాక్షమునకుఁ బాత్రుఁడగుటకుఁగా బ్రహ్మదేవుఁడు వాని నుదుట వ్రాయుచున్నాఁడు. దైన్యరేఖలు పాపమాతని యైదవ తలఁద్రుంచినాఁడవు. కానిమ్ము. దానితోపాటు తక్కిన నాలుగు తలలను మాత్రము ఛేదింపకుము. ఇంక దీర్ఘాయుష్మంతునిగా నుండనిమ్మని వేడుకొనుచున్నారు.

శ్లో. విరించిర్దీర్ఘాయుర్భవతు భవతా తత్పరశిర
శ్చతుష్కం సంరక్ష్యం స ఖలు భువి దైన్యం లిఖితవాన్,
విచారః కో వా మాం విశద కృపయా పాతి శివ తే
కటాక్షవ్యాపారస్స్వయమపి చ దీనావనపరః.

టీక:- విశద = నిర్మలస్వరూపుఁడవైన, శివ = శంకరా ! విరించిః = బ్రహ్మ, దీర్ఘాయుః = చిరకాలజీవి, భవతు = అగుఁగాక, భవతా = నీచేత, తత్పర శిరశ్చతుష్కం = ఐదవదికాక తక్కినవాని నాలుగు తలలు, సంరక్ష్యం = రక్షింపఁదగినది, సః = ఆబ్రహ్మ, భువి = భూలోకమందు, దైన్యం=దీనభావమును, లిఖితవాన్ ఖలు= వ్రాసెనుగదా! దీనావనపరః = దీనరక్షణమునం దాసక్తిగల, తే = నీయొక్క, కటాక్ష వ్యాపారః = కటాక్షప్రసారము, స్వయమపి = తనంతటతానే, కృపయా=దయతో,

పాతి = రక్షించుచున్నది, విచారః=దైన్యమును వ్రాయుటవలన విచారము, కోవా= ఏమున్నది? లేదు.

తా:- శంకరా! బ్రహ్మ మా ముఖమందు దైన్యము వ్రాయుచున్నాఁడు. అది మా కుపకారకముగా నున్నది గాని విచారకరముగాదు. కనుకనే కదా దీనపోషకమగు మీ కటాక్షమునకు పాత్రులమగుచున్నాము. అయినదేమో అయిపోయినది. పోనిమ్ము. ఇంక నాతని నాల్గుతలలు మాత్రము ఛేదింపకుము. ఆ బ్రహ్మ దీర్ఘాయుష్మంతు డగుఁగాక !

ఉ. నా మొగమందు దైన్యమును నల్వ లిఖించె మహేశ! దానికై
యేమియుఁ జింతనొందన దది యేలన దీనతతిన్ స్వయమ్ముగా
నోమెడు నీకటాక్ష లవమోమును నన్నటుగానఁ దక్కున
న్నోములఁద్రుంప కయ్యజు నమోఘుఁజిరాయువుఁ జేయు మీశ్వరా!

అవ:- దేవా! నీ పాదారవింద దర్శనముగా నిదే యెదురుగా నీ కటాక్షప్రసారము నాపైఁ గలుగ నేరదు. అదియును ప్రతిబంధక సామగ్రివలన దుర్లభముగా నున్నదని చెప్పుచున్నారు.

శ్లో. ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో
ప్రసన్నేఽపి స్వామిన్ భవదమలపాదాబ్జయుగళమ్,
కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాం శ్రేణిర్నిజకనకమాణిక్యమకుటైః.

టీక:- విభో = ఓ సర్వవ్యాపకుఁడవైన, స్వామిన్ = పరమేశ్వరా! మమ = నాయొక్క, పుణ్యానాం = సుకృతములయొక్క, ఫలాద్వా=ఫలమువలననో, మయి= నాయందు, కరుణయా వా = దయచేతనో, త్వయి = నీవు, ప్రసన్నేఽపి=ప్రసన్నుఁడవైన, భవత్ అమలపాదాబ్జయుగలమ్ = నిర్మలమైన నీ పాదపద్మములను, కథం = ఎట్లు, పశ్యేయం = చూతును ? నమస్సంభ్రమజుషాం = నమస్కారము చేయుటయందు తొందరపడుచున్న, నిలింపానాం = దేవతలయొక్క, శ్రేణిః = గుంపు, నిజకనకమాణిక్యమకుటైః = తమతమ రత్నాలు చెక్కిన బంగారు కిరీటములతో, మాం = నన్ను, స్థగయతి = అడ్డగించుచున్నది;

తా:- సర్వవ్యాపకుండవైన యో స్వామీ ! నా పుణ్యము వలననో నీ దయ చేతనో, నీ వనుగ్రహించిన ననుగ్రహింతువుగాని నీ పాదారవింద సందర్శన మగుట యెట్లు? దేవతలందఱును గుంపులు గుంపులుగాఁగూడి నేను నేనని నమస్కరించుటకు సంతోషముతో తొందరపడుచు వారి రత్నాల కిరీటముల మీఁ పాదములయందు మోపుచు నాకడ్డమగుచున్నారు.

ఉ. నావిమలంబుఁ బున్నె మొ ఘనంబగు నీకృపయో. కతమ్ముగా
నీవు ప్రసన్నబుద్ధి నను నేలగ నుంటివిగాని,యానమ
ద్దేవసమూహ హేమమణి దీప్తకిరీటము లడ్డురా భవ
త్పావన పాదదర్శనము పాటిలు టెట్లిక నాకు శంకరా ! 17

అవ:- మోక్షదాయకుఁడగు నొక్క పరమశివునుండియే హృదయగ్రంథి వీడ వలయునని కోరుచున్నారు.

శ్లో. త్వమేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
వహంత స్త్వన్మూలాం పునరపి భజంతే హరిముఖాః,
కియద్వా దాక్షిణ్యం తవ శివ మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరితదృశా.

టీక:- హేశివ = సుఖస్వరూపుఁడవైన యీశ్వరా ! లోకానాం = జనులకు, పరమఫలదః = మోక్షఫలము నిచ్చువాఁడవు, త్వం = నీవు, ఏకః = ఒక్కఁడవే, హరి ముఖాః=విష్ణువు మొదలగువారు, త్వన్మూలాం=నీవే కారణముగాఁగల్గిన, దివ్యపదవీం= వైకుంఠము మొదలగు దివ్యస్థానమును, వహంతః = పొందుచున్నవారై, పునరపి = మరల, భజంతే = సేవించుచున్నారు, తవ = నీయొక్క, దాక్షిణ్యం = దయ, కియద్వా = ఎంత పరిమాణము గలది? మదాశాచ = నాయొక్క ఆశయు, కియతీ = ఎంతటిది అనగా ఇంతయని యెఱుంగను, మత్ = అహంకారమునుండి, రక్షాం = నా సంరక్షణమును, కరుణాపూరితదృశా = సంపూర్ణ కటాక్షవీక్షణముతో, కదా = ఎన్నడు, వహసి = చేయుదువు ?

తా:- ఆనందస్వరూపుండవైన యో దేవా! మోక్షమిచ్చు మహాసుభావుఁడవు నీ వొక్కఁడవే. విష్ణ్వాదులు నీ దయచేతనే వైకుంఠ వాసులైరి. అయ్యును తనివి నొందక నీవలన నున్నతపదవులను గోరుచునే యుందురు. ఆహా! భక్తులమీద నీ కెంత

వయ! నా యాశ యెంతని చెప్పుదును! సంపూర్ణకటాక్షముతో నా అహంభావమును పోగొట్టి రక్షింపుము.

ఉ. ఈవొకరుండవే జనుల కెల్లను మోక్షపదమ్మునిత్తు వీ
శా! విధు ముఖ్యులీవిడిన సత్పదమొందియు మానరైరి నీ
సేవను నీ కృపంబలుకఁ జెల్ల దనంతము నాదు తృష్ణ చం
డీ వర! యింక నెన్నటికి నీవు ననుం గరుణించి కాతువో? 18

అవ:— తన్ను భజించువారలని యీశ్వరుఁడు బ్రహ్మ కొనర్చిన యుపకృతిని పరికించి ఈశ్వరభజన చేయుటచే తాము కృతార్థులమైతిమని నిశ్చయించుచున్నారు.

శ్లో. దురాశా భూయిష్ఠే దురధిపగృహద్వారఘటకే
దురంత్తే సంసారే దురితనిలయే దుఃఖజనకే,
మదాయాసం కిం న వ్యపనయసి కస్యోపకృతయే
వదేయం ప్రీతిశ్చేత్తవ శివ కృతార్థాః ఖలు వయమ్.

టీక:— దురాశాభూయిష్ఠే = దుష్టవిషయముల యందలి యాశచే మిక్కుటమైనదియు, దురధిపగృహద్వారఘటకే = దుష్టప్రభువుల మందిరద్వారములకు చేర్చునదియు, దురంతే = దురవసానము గలదియు, దురితనిలయే = పాపములకు ఉనికిపట్టును, దుఃఖజనకే = దుఃఖహేతువైన, సంసారే = జననమరణ ప్రవాహరూపమైన సంసారమునందు, మదాయాసం = నాపరిశ్రమను, కస్య = బ్రహ్మదేవునియొక్క, ఉపకృతయే = ఉపకారముకొఱకు, నవ్యపనయసికిం = పోగొట్టకుంటివాయేమి? వద = చెప్పుము, ఇయంప్రీతిః = ఈప్రేమ, తవ = నీకు, చేత్ = కలిగియున్నచో, వయమపి = నిన్ను భజించువారమైన మేము, కృతార్థాఃఖలు = కృతార్థులమే కదా!

తా:— ఈశ్వరా! దురాశలచేత దుష్టప్రభువుల గృహద్వారములయందుఁబడి కొట్టుకొనుచు పలుదుఃఖముల పాలుగావలసిన తుదిలేని సంసారమందలి నాపరిశ్రమల నేల నశింపఁజేయవు? నీ భక్తుఁడుగానున్న బ్రహ్మదేవునిమీది వాత్సల్యముచేత నాతని చేతలు చెఱుపనొల్లమి కాబోలు. నీవు భక్తవత్సలుఁడవయినప్పుడు మాకేమి లోపము? నిన్ను భజించి మేము కృతార్థులమగుదుముగదా!

చ. అరయ దురాశకిల్లయి, దురాఢ్యుల కొల్వు ఘటించు నట్టిదై
దురితనివాసమై, మిగుల దుఃఖకరమ్ము, దురంతమైన సం

సరణములోని ఖేదమును మాన్పవిదేమి? విరించి కోసమా ?
మఱి నది నీమతమ్మయిన మంచిది ధన్యుల నే మునుస్నివా ! 19

అవ:— ఇట్లీశ్వరప్రీతిని కోరకొని యిక చాంచల్యముఁ దొలఁగించి నా చిత్తమును నీ యధీనము చేయుమని వేడుచున్నారు.

శ్లో॥ సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశాశాఖాస్వటతి ఝడితి స్వైరమభితః,
కపాలిన్! భిక్షో! మే హృదయకపిమత్యంత చపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురు విభో!

టీక:— కపాలిన్ = బ్రహ్మకపాలము ధరించినవాఁడవును, విభో = సర్వవ్యాపకుఁడవును, శివ = ఆనందస్వరూపుడవును, భిక్షో = ఆదిభిక్షుఁడవునగునో దేవా! సదా = ఎల్లప్పుడును, మోహాటవ్యాం = సంసారవాంఛయను మహారణ్యమందు, చరతి = సంచరించుచున్నది, యువతీనాం = జవ్వనులయొక్క, కుచగిరౌ = స్తనములనెడు పర్వతమందు, నటతి = ఆటలాడుచున్నది, ఆశాశాఖాసు = దారపుత్రాదులయందలి ప్రేమయను కొమ్మలయందు, అటతి = దుముకులాడుచున్నది, ఝడితి = శీఘ్రముగా, అభితః = నలువంకలను, అటతి = పరుగులెత్తుచున్నది, అత్యంతచపలం= మిక్కిలిచంచలమైన, మే = నాయొక్క, హృదయకపిం—మనస్సనెడుకోఁతిని, దృఢం= గట్టిగా, భక్త్యా = భక్తియనెడు త్రాటితో, బద్ధ్వా = కట్టి, భవదధీనం=నీవశముగా, కురు = చేసికొనుము.

తా:— కోఁతివలె సంసారారణ్యమందు చంచలముగా తిరుగుచున్న నా చిత్తమును భక్తియను గట్టిత్రాటితో బిగియఁగట్టి నీ స్వాధీనము చేసికొమ్ము. నా చిత్తమునకు త్వదేక శరణమైన భక్తి ననుగ్రహింపుము.

మ. ఘనమోహాటవిలో, వధూపృథుకుచ గ్రావంబుపై మెట్టుచుం
డును, బేరాసలపేరి కొమ్మలపయిం దూకున్ యథేష్టమ్ముగా
ననిశం బిట్టటుఁజుట్టి క్రుమ్మరు మదీయస్వాంత కీశమ్ము, దా
నిని లోఁగొమ్మిఁక భక్తిరజ్జువున నెంతేఁగట్టి భిక్షుప్రభూ ! 20

అవ:— ఇట్లు మనస్సు నీశ్వరాయత్తముచేసి యింక దానిని కుటీరముగాఁజెప్పి యందు నివసింపుమని యీశ్వరుని వేడుకొనుచున్నారు.

శ్లో. ధృతిస్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివస సన్మార్గ ఘటితాం,
స్మరారే మచ్చేతస్స్ఫుటపటకుటీం ప్రాప్య విశదాం
జయ స్వామిన్ శక్త్యా సహ శివగణైస్సేవిత విభో.

టీక:- హేస్మరారే = కాముకునకు శత్రువైనవాఁడా! భోస్వామిన్=ప్రభూ! గణైః = స్వరూపమును విమర్శించు గణములచేత, సేవిత = ధ్యానింపఁబడువాఁడా! హేవిభో = ఓ సర్వవ్యాపకుఁడా! హేశివ = అఖండానందస్వరూపుఁడవగు పరమేశ్వరా! ధృతి = స్థైర్యమనెడు, స్తంభ = స్తంభము, ఆధారాం = ఆధారముగాఁ గలదియు, దృఢ = దృఢమైన, గుణ = త్రాళ్ళతో, నిబద్ధాం = కట్టఁబడినదియు, సగమనాం = ఎచ్చటికి కావలయునన్న నచ్చటికి పోవునదియు, విచిత్రాం = పలు రంగులు గలదియు, పద్మాఢ్యాం = లక్ష్మీయుక్తమును, పద్మములవంటి చిత్తరువులతో నొప్పునదియు, ప్రతిదివస = ప్రతిదినమందును, సన్మార్గఘటితాం = బ్రహ్మవిచారమందు చేరికగలదియు, రాజమార్గమందమర్పఁబడినదియు, విశదాం=నిర్మలమైనదియు, మచ్చేతః = నా చిత్తమనెడు, స్ఫుటపటకుటీం = స్ఫుటమైనడేరాను, ప్రాప్య = పొంది (ప్రవేశించి) శక్త్యాసహ = పార్వతితోకూడ, జయ = సర్వోత్కృష్టతో నుండుము.

తా:- కామజయముగల్గి సర్వస్వతంత్రుఁడవును, సర్వవ్యాపకుఁడవును పరమానంద స్వరూపుఁడవునగునో పార్వతీవల్లభా! నా చిత్త మిపుడొక గుడారముగా నున్నది. నా మనఃకుటీరము విషయ నిత్యత్వావధారణ మనెడు నిట్రాటిపైని నిలిచి యున్నది. గుడారము త్రాళ్ళతోఁ గట్టఁబడి నిలుపఁబడునట్లు చిత్తము త్రిగుణముల వలన జనించిన దేహాదులతో నిలుపఁబడి యున్నది. గుడార మెక్కడకుఁ గావలసిన నచ్చటకుఁ గొంపోఁబడునట్లు చిత్త మచ్చటచ్చటకుఁ గొంపోఁబడును. గుడారము పలు రంగులతో, పద్మములవంటి చిత్రములతో నుండునట్లు నా చిత్తము బహువిధములగు చిత్రవిచిత్రములగు జన్మాంతరవాసనలతో కూడి సంపదను గోరుచున్నది. మఱియు బ్రహ్మవిచారమునందుఁ గూర్పఁబడియున్నది. ఇట్టి నా చిత్త కుటీరమందు శక్తితోఁ గూడ నివసించి యుండుము.

చ. ధృతియను కంబమందు గుణబృంద నిబద్ధతఁజెంది పద్మసం
గతిఁదగి, చిత్రమై, కదలు గల్గినదై, సతతంబు సత్పథ

స్థితిగల మన్మనంబుఁ డెలితేట గుడారమునన్ వసింపు సం
తతమును శక్తితోఁగలసి నాగవిభూష! గణార్చితుండవై. 21

అవ:– అప్రయత్నపూర్వకముగా బ్రహ్మవిచారణయందుఁ జొనుపఁబడియు దొంగవలె లోభమున ధనాకర్షణాసక్తమైన చిత్తము నోర్వకపట్టి దానితప్పు సోఁగొట్టుమని యీశ్వరున కప్పగించుచున్నాఁడు.

శ్లో. ప్రలోభాద్యైరర్థాహరణపరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్తస్సన్భ్రమతి బహుధా తస్కరపతే,
ఇమం చేతశ్చోరం కథమిహ సహే శంకర విభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్.

టీక:– హే తస్కరపతే = చోరులకు ప్రభువైనవాఁడా! హే శంకర = భక్తులకు శుభము గలుగఁజేయువాఁడా! హే విభో = ఓప్రభూ! ప్రలోభాద్యైః = వశీకరణము మొదలగు ఉపాయములచేత, అర్థాహరణ=ధనాకర్షణమందు, పరతంత్రః= ఆసక్తిగలవాఁడై, చేతశ్చోరః = చిత్తమనెడు దొంగ, ధనిగృహే=ధనవంతుని యింటి యందు, ప్రవేశోద్యుక్తస్సన్ = ప్రవేశింప నుద్యుక్తుఁడగుచు, బహుధా = అనేక విధములుగా, భ్రమతి = తిరుగుచున్నాఁడు, ఇమం=ఈ, చేతశ్చోరం = చిత్తమనెడు దొంగను, కథం = ఎట్లుగా, సహే = సహింతును? ఇహ = ఇప్పుడు, తవ, అధీనం కృత్వా = నీ స్వాధీనము చేసికొని, నిరపరాధే=అపరాధములేనట్టి, మయి=నాయందు, కృపాం = దయను, కురు = చేయుము.

తా:– కల్లబొల్లి మాటలుచెప్పి ధనికుల చిత్తమును వశపఱచుకొనుట మొదలగు కొన్ని దుష్టోపాయములు పన్ని ధనాకర్షణమునకుఁగా ధనవంతుల యిండ్లలోఁ దూఱుచు తిరుగులాడుచున్న యీ మనస్సను దొంగను నే నోర్వలేను. నీ కప్పగించెదను. చోరప్రభువగు నీవు నీవశము చేసికొని నిరపరాధినగు నన్ను దయతో రక్షింపుము.

మ. అని శంబర్థరతిఁ ప్రబలోభముఖ మిత్రాళిం దగంగూడి మ
న్మనమన్ చోరుఁడు విత్తవంతుల గృహాంతస్సీమలన్ దూఱుఁ బొం
చి నితాంతమ్ముఁ జరించు, నీనతని వాసింబట్టి లోఁగొంచు, నె
మ్మిని మన్నింపు మమాయికున్ నను గడున్మేలెంచి చోరప్రభూ!

అవ:— శివపూజకు ఫలమగు బ్రహ్మత్వ విష్ణుత్వములుగూడ దోషయుక్తములు గాన అవి వలదని నిర్దుష్టమైన మోక్షానందమును గోరుచున్నారు.

శ్లో. కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫలమితి,
పునశ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథమిహ సహే శంకర విభో.

టీక:— హేవిభో = ఓ మహాదేవా ! త్వత్పూజాం = నీ యారాధనమును, కరోమి = చేయుదును, సపది = తక్షణమే, భోశంకర = ఓ సుఖకరుఁడైనవాఁడా ! మే = నాకొఱకు, సుఖదః = నిత్యసుఖము నిచ్చువాఁడవు, భవ=అగుము, తస్యాః= ఆ పూజకు, విధిత్వం = బ్రహ్మయగుట, విష్ణుత్వం = విష్ణువగుట, ఫలమితి=ఫలమని, దిశసిఖలు = ఇత్తువుగదా ! పునశ్చ = మరల ఇటుమీఁదను, దివి = ఆకాశమందును, భువిచ = భూమియందును, త్వాం = నిన్ను, ద్రష్టుం=చూచుటకు, పక్షిమృగతాం= హంస పక్షిరూపముగానీ, వరాహరూపముగానీ, వహన్ = ధరించుచు, అదృష్ట్వా = చూడలేక, తత్ఖేదం=పక్షి మృగములుగాఁ బుట్టుటవలని దుంఖమును, కథం=ఎట్లుగా, సహే=సహింతును, విభో=మహాప్రభూ !

తా:— శంకరా ! నిన్నారాధింతును. నాకు పూజాఫలముగా మోక్షానంద మొసంగుము. కాని బ్రహ్మత్వమో విష్ణుత్వమో దానికి ఫలమని మాత్రి మీయవద్దు. అక్కడనుండి హంసగానో పందిగానో పుట్టి నీపాదములను శిరస్సును కనుగొనుటకు పదునాల్గులోకములు తిరిగి శ్రమపడలేను. ఆమీఁద తుదకు నిన్ను కన్గొననేరక క్షుద్ర జన్మవలని యవమానమును సహింపనేరను. కాన బ్రహ్మవిష్ణు లోకానందములకన్న నధికమైన సాయుజ్య ముక్తియను పరమానందము దయచేయుమని భావము.

మ. నినుఁబూజించెదఁ దోన ముక్తినిడు మంతేకాని యొప్పోఫలం
బని బ్రహ్మత్వ హరిత్వముల్ సరవినీయంబోకు మీశాన! యే
లన నిన్వెండిఁగనంగనే మృగతనో యంహోద్భవత్వంబునో
కని భూవ్యోమవిహారఖేదమున కగ్గంబౌదుఁగాదే ప్రభూ ! 23

అవ:— పైనిచెప్పిన సాయుజ్యముక్తికి చేరిక సాధనమైన శివసాన్నిధ్యమును గూర్చిన తత్తఱపాటును జూపుచున్నారు.

శ్లో. కదా వా కైలాసే కనకమణిసౌధే సహ గణై
ర్వసన్ శంభోరగ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః,
విభో సాంబస్వామిన్ పరమశివ పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణమివ వినేష్యామి సుఖతః.

టీక:— కైలాసే = కైలాసమందు, కనకమణిసౌధే = బంగారు రత్నాల మేడమీఁద, గణైస్సహ = ప్రమథగణములతోఁ గూడ, శంభోః = పరమశివునియొక్క, అగ్రే = ఎదుట, వసన్=ఉన్నవాఁడనై, స్ఫుటఘటిత = దృఢముగా కూర్పఁబడిన, మూర్ధాంజలిపుటః = శిరస్సునందలి అంజలి బంధముగల వాఁడనగుచు, భోవిభో, భోసాంబ, భోస్వామిన్, భోపరమశివ, పాహి=రక్షింపుము, ఇతి =ఇట్లు, నిగదన్= పలుకుచున్నవాఁడనై, సుఖతః=అట్టి ఆనందానుభవమువలన, విధాతౄణాంకల్పాన్= అనేక బ్రహ్మకల్పములను, క్షణమివ = నిమిషమాత్రముగా, కదావా = ఎప్పుడు, వినేష్యామి=గడుపుదునో ?

తా:— కైలాసమునకుఁజేరి ప్రమథగణములతోఁగూడ పరమేశ్వరుని యెదుట హే విభో హే సాంబ హే స్వామిన్ హే పరమశివ పాహిపాహి యని పలుకుచు సంతోషముతో అనేక బ్రహ్మకల్పములు నిమేషంబులుగా కాలమెప్పుడు గడపుదునో కదా !

శా. కైలాసమ్మున హేమరత్నఖచితా గారాంత రక్షోణులన్
శాలింబ్రామథపాళిఁగూడి తలపైఁ బాణిద్వయిన్ మోడ్చి శ
ర్వా! లోకేశ్వర! కావుమంచును దదగ్రస్థాయినై బ్రహ్మ క
ల్పాళి న్నేను క్షణంబు లంబలెను బాయంద్రోచుటే నాటికో !

అవ:— అదియే మఱియొక విధముగాఁ జెప్పుచున్నారు.

శ్లో. స్తవైర్బ్రహ్మాదీనాం జయజయవచోభిర్నియమినాం
గణానాం కేళీభిర్మదకలమహోక్షస్య కకుది
స్థితం నీలగ్రీవం త్రిణయనముమాశ్లిష్టవపుషం
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖండపరశుమ్.

టీక:— బ్రహ్మాదీనాం=బ్రహ్మమొదలగు వారియొక్క, స్తవైః=స్తోత్రముల తోడను, నియమినాం = నియమవంతులగు మహాత్ముల యొక్కయు, జయజయ

వచోభిః = జయజయ ధ్వనులతోడను, గణానాం = ప్రమథగణముల యొక్క, కేళిభిః = క్రీడలతోడను, మదకలమహోక్షస్య = సంతోషాతిశయమున సొంపుగానున్న వృషభముయొక్క, కకుది = మూపునందు, స్థితం = ఉన్నట్టివాడును, నీలగ్రీవం = నల్లని కంఠముగలవాడును, త్రిణయనం = మూడుకన్నులు గలవాడును, ఉమాశ్లిష్టవపుషమ్ = పార్వతీదేవిచేత నాలింగనము చేసికొనబడిన దేహముగలవాడును, కరధృతమృగం = చేతితో పట్టుకొనబడినలేడి గలవాడును, ఖండపరశుం = ఖండమైన గండ్రగొడ్డలి గలవాడును అగు, త్వాం = నిన్ను, కదావా = ఎప్పుడు, పశ్యేయం = చూతును.

తా:- స్తోత్రపాఠములతో బ్రహ్మాదులును, జయజయ ధ్వనులతో మహర్షులును, ఆటపాటలతో ప్రమథగణంబులును గొలువ పార్వతీ సమేతుండవై వృషభ వాహనమునిూద వేంచేసియున్న నీ సందర్శనముచేయు భాగ్యము నా కెన్నడు లభించునోగదా !

ఉ. తామరసోద్భవాది విబుధ వ్రజకీర్తనలొప్ప సంయమి
గ్రామ జయధ్వనుల్ మెఱయఁ బ్రామథకేళు లెసంగ వార్షభ
స్వామి కకుద్గతుండయిన శర్వు, నుమాంచితు, నీలకంఠు, నా
సోమకిరీటు, శూలధరుఁ జూడఁగ నాకిఁక నెన్నఁడబ్బునో ! 25

అవ:- ఆ పరమేశ్వరునే యింకొక ప్రకారముగాఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్,
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుటజలజగంధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యైర్ముదమనుభవిష్యామి హృదయే.

టీక:- హే గిరిశ = పర్వతశాయివగునో శంకరా! త్వాం = నిన్ను, దృష్ట్వా = చూచి, తవ = నీయొక్క, భవ్యాంఘ్రియుగళం = క్షేమకరమైన పాదములను, హస్తాభ్యాం = చేతులతో, గృహీత్వా = పట్టుకొని, శిరసి = శిరస్సునందును, నయనే = నేత్రములందును, వక్షసి = వక్షఃస్థలమందును, వహన్ = చేర్చుకొనుచున్నవాడనై, సమాశ్లిష్య = కౌగిలించుకొని, స్ఫుటజలజగంధాన్ = వికసించిన పద్మములయొక్క సుగంధమువంటి సుగంధముగల, పరిమళాన్ = పరిమళములను, ఆఘ్రాయ =

మూర్కొని, బ్రహ్మాద్యైః = బ్రహ్మ మొదలగు వారిచేత, అలభ్యాం = పొందశక్యము గాని, ముదం = సంతోషమును, హృదయే = హృదయమునందు, కదావా = ఎప్పుడు, అనుభవిష్యామి = అనుభవింతును.

తా:- దేవా! నిన్నుఁజూచి నీ పాదములను చేతులతో పట్టి, శిరస్సునందు, నేత్రములందు బొమ్మనను జేర్చి కౌగలించుకొని అందలి పద్మగంధముల నాఘ్రాణించి బ్రహ్మాదులకును దొరకని యానందము నెప్పుడు పొందుదునో కదా!

చ. నిను గనులార నేనుగని నీమహితాంఘ్రులఁ జెట్టఁబట్టి, మ
న్ననను దలఁదాల్చి, నయనమ్ములనద్ది, యెడందఁ జేర్చి యు
క్కునినిడి, తమ్మితావులను గొల్చు సుగంధములాని బ్రహ్మయుఁ
గనని మహాముదమ్మెపుడు గాంచి సుఖింతు గిరీశ! యీశ్వరా! 26

అవ:- సర్వసంపూర్ణుఁడగు పరమేశ్వరున కీయవలసిన దొకటియు లేమింజేసి తన మనస్సు నర్పించుచున్నారు.

శ్లో. కరస్థే హేమాద్రౌ గిరిశ! నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామరసురభి చింతామణిగణే,
శిరస్థే శీతాంశౌ, చరణయుగళస్థేఽఖిలశుభే
కమర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః.

టీక:- హే గిరిశ = పర్వతశాయివగునో యీశ్వరుఁడా! హేమాద్రౌ = బంగారుకొండ, కరస్థే = చేతిలోనుండగా, ధనపతౌ = కుబేరుఁడు, నికటస్థే = దగ్గఱ నుండగా, స్వర్భూజ = కల్పవృక్షములయొక్కయు, అమరసురభి = కామధేనువు యొక్కయు, చింతామణి = చింతామణులయొక్కయు, గణే = సమూహము, గృహస్థే = ఇంటిలోనుండగా, శీతాంశౌ = చంద్రుఁడు, శిరస్థే = శిరస్సున నుండగా, అఖిలశుభే = సమస్త శుభమును, చరణయుగళస్థే = పాదద్వంద్వమందుండగా, కం అర్థం = ఏ యిష్టార్థమును, అహం = నేను, దాస్యే = నీకిత్తును? మమ మనః = నాయొక్క మనస్సు, భవదర్థం = నీ కొఱకు, భవతు = అగుఁగాక!

తా:- కైలాసవాసా! బంగారుకొండ నీచేతనున్నది. కుబేరుఁడు మిత్రుఁడుగా నీ దగ్గఱనున్నాఁడు. కోరికలనిచ్చు కల్పవృక్షములును, కామధేనువు చింతామణులును నీ యధీనములై నీయింట నున్నవి. చంద్రుడు భూషణముగా నీ శిరస్సున నున్నాఁడు. సమస్త శుభంబులును నీపాదంబుల వలన కలుగుచున్నవి. శంకరా! నే నొసంగఁదగిన దొక్కటియు కానరాదు. కనుక నా చిత్తము నర్పించెదను చేకొనుము.

మ. కనకాహార్యము హస్తమందు, నికటస్థా్నసీమ విత్తేశ్వరుం
డు, నికేతమ్మునఁ గల్పభూజ సురథే నుస్స్వర్మణుల్, శీర్షసీ
మను జంద్రుండు, పదంబులందఖిల సన్మాంగల్యముల్ గల్గు నీ
కు, నిఁకేమిచ్చి తరింతునీశ! యిదె గ్రైకొమ్మిత్తు మచ్చిత్తమున్.

అవ:— ఉదహరింపఁబోవు హేతువుల వలన నట్టి ఫలంబులు చేకుఱుటంబట్టి తాను ధన్యుఁడ నైతినని యనుకొనుచున్నారు.

శ్లో. సారూప్యం తవ పూజనే శివ మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తిధుర్యజనతా సాంగత్య సంభాషణే,
సాలోక్యం చ చరాచరాత్మకతనుధ్యానే భవానీపతే
సాయుజ్యం మమసిద్ధమత్రభవతి స్వామిన్ కృతార్థోఽస్మ్యహమ్.

టీక:— భోస్వామిన్ = ఓ సర్వాధ్యక్షుఁడా! తవ = నీయొక్క, పూజనే = పూజచేసినప్పుడు, సారూప్యం = సమానరూపము పొందుటయు, శివమహాదేవేతి సంకీర్తనే = హే శివా హే మహాదేవా అని కీర్తించినప్పుడు, సామీప్యం = సమీపమందుండుటయు, శివభక్తిధుర్య = ఈశ్వరభక్తి యను భారమును వహించుచున్న, జనతా = జనసమూహముయొక్క, సాంగత్యసంభాషణే = సహవాసము, సల్లాపము కలిగినపుడు, సాలోక్యం = ఒక్కలోకమందునికియు, హే భవానీపతే = ఓ శంకరా! చరాచరాత్మక = స్థావరజంగమరూపమైన, తను = మూర్తియొక్క, ధ్యానే = ధ్యానము చేసినప్పుడు, సాయుజ్యం = నీతోడ ఐక్యమును, మమ = నాకు, అత్ర = ఈ జన్మమందు, సిద్ధంభవతి = సిద్ధించుచున్నది. కనుక, అహం = నేను, కృతార్థః = ధన్యుఁడను, అస్మి = అగుచున్నాను.

తా:— దేవా! నీ పూజయందు సారూప్యమును, నీ నామసంకీర్తనమందు సామీప్యము, నీ భక్తులతోకూడి కథాకాలక్షేపములు చేయుపట్ల సాలోక్యము, చరాచరాత్మకమైన నీ మూర్తి ధ్యానమందు సాయుజ్యమును గూడ నాకీలోకమందే దయచేయుచుంటివిగాన ధన్యుఁడ నైతిని.

మ. అగు సారూప్యము నీ సమర్చను; శివాద్యాఖ్యోఘ సద్గీతిచే
నగు సామీప్యము; తావకాశ్రితజన వ్యాసంగ సద్గోష్ఠిచే

నగు సాలోక్యము; తచ్చరాచరసమేతాంగైక చింతాప్తిచే
నగు సాయుజ్యము; సర్వమిందెకలదీశా! నాకు లోటేమిఁకన్.

అవ:— వేఱొకవిధముగాఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. త్వత్పాదాంబుజమర్చయామి పరమం త్వాంచింతయామ్యన్వహం
త్వామీశం శరణం వ్రజామి వచసా త్వామేవ యాచే విభో,
వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం దివ్యైశ్చిరం ప్రార్థితాం
శంభో లోకగురో మదీయమనసస్సౌఖ్యోపదేశం కురు.

టీక:— హే విభో = సర్వవ్యాపకుఁడా! పరమం = మిక్కిలి ఉత్కృష్టమైన, త్వత్ పదాంబుజం = నీపాదపద్మమును, అర్చయామి = పూజించుచున్నాను; అన్వహం = ప్రతిదినమును, త్వాం = నిన్ను, చింతయామి = తలచుచున్నాను, ఈశం = జగత్కర్తవగు, త్వాం = నిన్ను, శరణం వ్రజామి = దిక్కుగా పొందుచున్నాను, వచసా = వాక్కుచేత, త్వామేవ = నిన్నే, యాచేవ = యాచించుచున్నాను, దివ్యైః = దేవతలచేతను, చిరం = చాలకాలముగా, ప్రార్థితాం = ప్రార్థింపఁబడినదియు, సకరుణాం = దయతోకూడినదియు, చాక్షుషీం = నేత్రములసంబంధమైన, వీక్షాం = కటాక్షప్రసారమును, మే = నాకు, దిశ = ఇమ్ము, శంభో = సుఖకరుఁడా! లోకగురో = భక్తలోకమునకు రహస్యార్థములను తెలియఁజేయువాఁడా! మదీయ మనః = నా మనస్సునకు, సౌఖ్యోపదేశం = బ్రహ్మోపదేశమును, కురు = చేయుము.

తా:—పరమేశ్వరా! నీ పాదార్చనముచేయుచు ప్రతి దినము నిన్ను తలంచుచు శరణుపొంది వేఁడుకొందును. నీ కరుణాకటాక్షమును నాపై ప్రసరింపఁజేసి క్లేశము లడంచుచు బ్రహ్మోపదేశము చేయుము.

చ. పరము నెదన్ భజింతు నీనుఁదృత్పదపద్మము లర్చసేతు, నిన్
శరణమటందు వా తెఱచి శంకర! నాపయిఁ జేస్పు దేవతల్
చిరముగఁ గోరియుంబడయ లేని భవత్కరుణాకటాక్షమున్
మఱి గురుతన్ వహించి సుఖమార్గముఁజూపుము నాకు శంకరా!

అవ:— ఇప్పుడు నేనున్న స్థితితో నీ శుశ్రూష చేయఁజాలననుచున్నారు.

శ్లో. వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా పుష్పార్చనే విష్ణుతా
గంధే గంధవహాత్మతాన్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా,

పాత్రే కాంచనగర్భతాస్తి మయి చేద్బాలేందు చూడామణే
శుశ్రూషాంకరవాణి తే పశుపతే స్వామిన్ త్రిలోకీగురో.

టీక:— హే బాలేందు చూడామణే = ఓ చంద్రశేఖరా ! హే పశుపతే = సంసారబంధమోచకుఁడా! హే స్వామిన్ = ఓ సర్వలోకాధ్యక్షా ! త్రిలోకీగురో = ముల్లోకములకు గురువైనవాఁడా! తే=నీయొక్క, వస్త్రోద్ధూతవిధౌ=వస్త్రోపచారము చేయుటయందు, సహస్రకరతా = సూర్యుఁడగుటయు, పుష్పార్చనే = పుష్పోప హారార్పణమందు, విష్ణుతా = విష్ణువగుటయు, గంధే = గంధోపచారమందు, గంధవ హాత్మతా = వాయురూపుఁడగుటయు, అన్నపచనే = అన్నము వండుట యందనగా హవిరుపచారము చేయుటయందు, బర్హిర్ముఖాధ్యక్షతా=ఇంద్రుడగుటయు, పాత్రే= పాత్రోపచారమందనగా అర్ఘ్యవిధియందు, కాంచనగర్భతా = హిరణ్యగర్భుఁ డగుటయు, మయి = నాయందు, అస్తిచేత్ = ఉన్నయెడల, తే = నీయొక్క, శుశ్రూషాం = సేవను, కరవాణి = చేయఁజాలుదును.

తా:— సర్వవ్యాపకా ! నీకు వస్త్రోపచారము చేయుటకు వేయికరములు గల వాడు కావలయును. పుష్పోపచారము చేయుటకు వ్యాపకుండు కావలయును గంధోపచారమునకు గంధవహుండు గావలయును. వంటచేసి నీకు హవిస్సు నివేదన చేయుటకు అగ్నిముఖాధ్యక్షుఁడు గావలయును. అర్ఘ్యపాత్రము సమర్పించుటకు అగర్భ శ్రీమంతుఁడు గావలయును. అట్టి సూర్యుండును, విష్ణువును, వాయుదేవుఁ డును, దేవేంద్రుఁడును, హిరణ్యగర్భుండును నైననే కాక నీ కుపచారముచేయ నా తరమా ?

సీ. వస్త్రోపచారమ్ముఁ బచరించు పట్టున
నల సహస్రకరుండ నగుదునేని
కుసుమార్చనమ్ముఁ జేకూర్చువేళను జగ
ద్వ్యాపియౌ విష్ణుండ నగుదునేని
పాటీర పరిచర్యఁ బాటించు తఱిఁజల్ల
నగు గంధవాహుండ నగుదునేని
హవిరన్నమునువండు నప్పుడా బర్హిర్ము
ఖావళీ నాథుండ నగుదునేని

గీ. ఆరగింపునకై పాత్ర మలవరించు
నపుడు హాటకగర్భుండ నగుదునేని
దేవ ! కావింపనేర్తు నీ సేవనేను
స్వామి! జగదీశ! పశుపతీ! చంద్రమౌళి! 30

అవ:— పరమేశ్వరుని యందున్న లోకోత్తరమైన శక్తిని చూపుచున్నారు.

శ్లో. నాలం వా పరమోపకారకమిదం త్వేకం పశూనాం పతే
పశ్యన్కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్
సర్వామర్త్యపలాయనౌషధమతి జ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళే న గిళితం నోద్గీర్ణమేవ త్వయా.

టీక:— హే పశూనాంపతే = ఓ భూతనాథా ! కుక్షిగతాన్ = కడుపులోనున్న, చరాచరగణాన్ = స్థావరజంగమ సమూహములను, బాహ్యస్థితాన్ = వెలుపలనున్న వారలను, రక్షితుం = కాపాడుటకు, పశ్యన్ = ఆలోచించుచు, త్వయా = నీచేత, అతిజ్వాలాకరం = మిక్కిలి తాపము గలుగఁజేయునదియు, భీకరం = భయంకరమును నగు, గరళం = కాలకూటవిషమును, సర్వామర్త్య = సమస్త దేవతలయొక్కయు, పలాయన = పాఱిపోవుటయనెడు రోగమునకు, ఔషధం = మందగునట్లుగా, గళే = కంఠమందు, నిక్షిప్తం = నిలుపఁబడినదై, నగిళితం = మ్రింగఁబడలేదు, నోద్గీర్ణమేవ = వెడల నుమియఁబడనులేదు, పరమోపకారకం = మిక్కిలి యుపకారకమైన, ఇదం ఏకం = ఇది యొక్కటియే, నాలంవా = చాలదా ?

తా:— నిఖిలలోక భయంకరమై సంతాపకరమైన కాలకూటమును భయపడి పాఱిపోవు దేవతల నూఱడించుటకుఁగా నీ కంఠమందె యుంచుకొని యుమియక మ్రింగక కడుపులోని వారలకును, వెలుపలి వారలకును, బాధ కలుగకుండ మహోపకార మొనర్చితివి. దేవా ! నీ మహిమ తెలియుట కీ దృష్టాంత మొక్కటి చాలదా

చ. కొలకొలఁబాఱు వేలుపులు కోల్కొనికూడఁగఁ గుక్షినిన్ వెలిన్
గలుగు చరాచరమ్ముల కొకానొక హానియుఁ గల్గకుండ, నీ
వల భయదార్చి రుగ్రమగు హాలహలమ్మును గంఠమందె బ
ల్మైలకువ నిల్పనేర్చితివి మ్రింగవు, క్రక్కవు చిత్రమీశ్వరా! 31

అవ:- పరమశివుఁడు తీసికొనిన విషమునుగూర్చి మూఁడువిధములఁ బ్రశ్నించుచున్నారు.

శ్లో. జ్వాలోగ్రస్సకలామరాతిభయదః క్ష్వేళః కథం వా త్వయా
దృష్టః కించ కరే ధృతః కరతలే కిం పక్వజంబూఫలమ్,
జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా వా కంఠదేశే భృతః
కింతే నీలమణిర్విభూషణమయం శంభో మహాత్మన్వద.

టీక:- హే మహాత్మన్=సర్వజ్ఞుఁడవైన యీశ్వరుఁడా! జ్వాలోగ్రః=మంటలచేత సహింపఁగూడనిదియు, సకలామర = అందఱు దేవతలకు, అతిభయదః = మిగులభయంకరమునగు, క్ష్వేళం = విషము, త్వయా = నీచేత, కథంవా = ఎట్లుగా, దృష్టః = చూడఁబడినది? కించ = అంతేకాక, కరే = హస్తమందు, ధృతః = ధరింపఁబడినది? కరతలే = అఱచేతియందు, నిహితః = ఉంచుకొనఁబడినది? పక్వజంబూఫలం కిం = పండిన నేరేడు పండాయేమి? జిహ్వాయాంచ = నాలుకయందును, నిహితః = వేసికొనఁబడినది, సిద్ధఘుటికావా = ఔషధఘుటికయా యేమి ? కంఠదేశే = కంఠప్రదేశమందు, భృతః = భరింపఁబడినది, అయం = ఈ కాలకూటవిషము, తే = నీకు, విభూషణం = అలంకారమైన, నీలమణిఃకిం = ఇంద్రనీలమణియా యేమి ? వద = చెప్పుము.

తా:- తీవ్రజ్వాలలు గ్రమ్ముచు సకల దేవతలకును భయంకరమైన యీ కాలకూటవిషమును కన్నులతోఁ గాంచుటయేకాక చేతితో నెత్తి యఱచేతిలో నుంచుకొంటివది నేరేడు పండాయేమి ? ఇదికాక నాలుకమీఁద వేసికొంటివి. సిద్ధఘుటికయా యేమి ? మఱియును కంఠమందటులనే యుంచుకొంటి వది యింద్రనీలమణియా యేమి చెప్పుము.

ఉ. వేలుపులెల్ల భీతిగొనఁ బేర్చెడు మంటల దుర్నిరీక్షమా
క్ష్వేళము నెట్లు చూచితివి? చేకొన నేర్చితి వఱ్ఱొ నేరెడా?
నాలుకపై ఘటించితివి నల్లగు సిద్ధరసంపుఁగుప్పెయా ?
శూలి! గళంబుఁ జేర్చితివి సుందర నీలమణీ విభూషయా ? 32

అవ:— దిగువ నుదహరింపఁబోవు సాధనములలో నేదేని యొక్కదానిచేత మోక్షము సులభమగుట నూహించి యితర దేవతానుసరణము విఫలమనుచున్నారు.

శ్లో. నాలం వా సకృదేవ దేవ భవతస్సేవా నతిర్వా నుతిః
పూజావాస్మరణంకథాశ్రవణ మప్యాలోకనం మాదృశామ్,
స్వామిన్నస్థిర దేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కావా ముక్తిరితః కుతో భవతి చేత్కిం ప్రార్థనీయం తదా.

టీక:— హే స్వామిన్ = సర్వభూతాధ్యక్షుండవైన దేవా! భవతః=నీయొక్క, నతిర్వా = నమస్కారమేని, నుతిర్వా = స్తోత్రమేని, పూజావా = పూజయేని, స్మరణం = స్మరించుటయేని, కథాశ్రవణమపి = నీ చరిత్రలు వినుటయేని, ఆలోకనం= నీమూర్తి చూచూటయేని, సకృదేవ = ఒక్కమాఱు మాత్రమే, భవతః = నీయొక్క, సేవా = భజనము, మాదృశాం = నావంటి వారలకు, నాలంవా = చాలదా? ఇతః = ఈపై యుపాయమును విడిచి, ముక్తిః = మోక్షము, కావా = ఎట్టిది ? కుతో౽పి=పై యుపాయములలో నొకదానినుండి గాైనను, భవతిచేత్ = ముక్తిగల్గునేని, తదా= అప్పుడు, అస్థిర = శాశ్వతముగాని, దేవతా = దేవతలయొక్క, అనుసరణాయాసేన= ఆశ్రయించు ప్రయత్నముచేత, కింలభ్యతే = ఏమిలాభమగును ? ప్రార్థనీయం = కోరఁదగినదియు, కిం = ఏమున్నది ?

తా:— ఓ స్వామీ! నమస్కారము. స్తోత్రము, స్మరణము మొదలగు నీ సేవల యం దొకొక్కటియు మోక్షమునకు గొప్ప సాధనము. ఈ యుపాయములను వీడి వేఱ మోక్షములేదు. అస్థిరులైన యితర దేవతల ననుసరించి యేమిలాభము ? వారినిఁ గోరఁగిన దేమున్నది ?

ఉ. నీ కథలాలకించుటయొ నిన్ను స్మరించుటొ, పూజసేయుటో
నీకు నమస్కరించుటయొ ని న్నుతియించుటో, నిన్ను గాంచుటో
మాకొకమాఱు చేకుఱు, సు మాధవ ! ముక్తియఁగాదె? యస్థిరం
బే కద లాతివేల్పులను వేఁడినఁగల్గు ఫలంబు శంకరా ! 33

అవ:— ఆ పరమశివుని తెఱఁగు మతి యేరికిని రాదని చెప్పచున్నారు.

శ్లో. కిం బ్రూమ స్తవ సాహసం పశుపతే కస్యాస్తి శంభో భవ
ద్ధైర్యంచేదృశమాత్మనస్థితిరియంచాన్యైః కథం లభ్యతే,

భ్రశ్యద్దేవగణం త్రసన్మునిగణం నశ్యత్ప్రపంచం లయం
పశ్యన్నిర్భయ ఏకఏవ విహరత్యానందసాంద్రోభవాన్.

టీక:— హే పశుపతే = ఓ భూతనాథా! హే శంభో = ఓ శంకరా! తవ = నీయొక్క, సాహసం = తెగింపు, కింబ్రూమః = ఏమని చెప్పగలము, ఈదృశం = ఇటువంటి, భవధైర్యం = నీ ధైర్యము, కస్య = ఎవనికి, అస్తి = కలదు ? ఇయం = ఈ, ఆత్మనః = తనయొక్క (నీయొక్క), స్థితిశ్చ = ఉనికియును, అన్యైః = ఇతరులచేత, కథం = ఎట్లుగా, లభ్యతే = పొందఁబడును ? ఆనందసాంద్రః = సంతోషముతో నిండియున్న, భవాన్ = నీవు, భ్రశ్యద్దేవగణం = పడిపోవు దేవతాసమూహమును, త్రసన్మునిగణం = భయపడుచున్న ముని సమూహమును, నశ్యత్ప్రపంచం = మాయమైపోవుచున్న ప్రపంచమునుం గలదియగు, లయం = ప్రళయకాలమును, పశ్యన్ = చూచుచు, నిర్భయః = భయములేనివాడవై, ఏకఏవ = ఒక్కడవే, విహరతి = విహరించుచున్నావు.

తా:— ఓ శంకరా! ఏమి నీ సాహసము ? నీ ధైర్యము ? మరెవ్వరేని ఇట్లు నిలిచి యుండఁగలరా ? నాశోన్ముఖులై దేవతలందరిటునటు పాఱఁజూచుచుండ, మునులందఱు భయకంపితులగుచుండ తుదకు ప్రపంచమంతయు నశించి పోవుచుండ నీ వొక్కడవేకదా నిర్భయుఁడవై మహాప్రళయమందోటులేక విలసిల్లు చుంటివి.

మ. అమరస్తోమముగూల, పౌనులు భయంబందన్, బ్రపంచంబు మా
యు, మిటారించులయంబు నుంగనుచు, నీవళ్లోందఁగాఁబోక, యొం
టి మహానందమెసంగ నిల్తు వహాహా ! నీసాహసంబేమి చె
ప్ప మహేశా! యిఁకనొడ్ల కిట్టివిధముల్ వాటిల్లునే యేరికిన్. 34

అవ:— పరమశివుని గుణంబులన్నియుఁ దెలిసినట్టేకదా ! ఆతఁడు పరమాప్తుఁడని మాత్రము స్మరించుచుండెదనని ప్రతిజ్ఞ చేయుచున్నారు.

శ్లో. యోగక్షేమధురంధరస్య సకలశ్రేయఃప్రదోద్యోగినో
దృష్టాదృష్టమతోపదేశకృతినో బాహ్యాంతరవ్యాపినః,
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా
శంభోత్వంపరమాంతరంగ ఇతిమేచిత్తేస్మరామ్యన్వహం.

టీక:- యోగక్షేమధురంధరస్య = యోగక్షేమభారమును వహించినట్టియు, సకలశ్రేయఃప్రదోద్యోగినః = సమస్త శుభంబుల నిచ్చెడు నట్టి యుద్యోగముగల్గి నట్టియు, దృష్టాదృష్ట = ఐహికాముష్మికములకు, మత = సమ్మతమైన యుపాయమును, ఉపదేశకృతిః = ఉపదేశించు నేర్పుగలిగినట్టియు, బాహ్యాంతర వ్యాపినః = బాహ్యప్రపంచమందును నిండియున్నట్టియు, సర్వజ్ఞస్య = సర్వజ్ఞుఁడవైనట్టియు, దయాకరస్య = దయఁజూచునట్టియు, భవతః = నీయొక్క, మయా = నాచేతను, వేదితవ్యం = తెలియఁదగినదియు, కిం = ఏమియున్నది? త్వం = నీవు, మే = నాకు, పరమాంతరంగః = అత్యంతాప్తుఁడవు, ఇతి = అని, అన్వహం = ప్రతిదినమును, చిత్తే = మనస్సునందు, స్మరామి = తలంచుచున్నాను.

తా:- ప్రజల యోగక్షేమభారము వహించుట, సకలశ్రేయస్సు లొసంగుట, ఐహికాముష్మిక సాధనోపాయంబుల నుపదేశించుట, ఎల్లరను దయతోఁజూచుట, సర్వజ్ఞత్వము, ఎల్లెడ నిండియుండుట నీ గుణములుగదా! నీవే నాకు పరమాప్తుఁడవని యెల్లవేళలఁ దలంతును. అదియే నాకు శ్రేయస్కరమగుఁగాక!

ఉ. కోరిన సర్వభద్రములఁ గూర్చుచు వేలుపు, యోగదాత, మే
లారసి యిచ్చుజో, దిహపరార్థ సుసాధనబోధకుండు, వి
స్ఫారజగత్పరిపూర్ణుఁడు, కృపానిధి, నా నినుగూర్చివింటి. బెం
పార స్మరింతు నిన్నుఁ బరమాప్తునిగా హృదినిల్పి యీశ్వరా!

అవ:- పదార్థ రూపకత్వముచే పరమశివుని స్మరించుచున్నారు.

శ్లో. భక్తో భక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
కుంభే సాంబ తవాంఘ్రిపల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలమ్,
సత్త్వం మంత్రముదీరయన్ నిజశరీరాగారశుద్ధిం వహన్
పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణమాపాదయన్.

టీక:- హే సాంబ = ఓ శంకరా! భక్తః = భక్తుఁడనైన నేను, నిజశరీర = స్వీయశరీరమనునట్టి, అగారశుద్ధిం = ఇంటియొక్క పరిశుభ్రతను, వహన్ = మోయుచున్నవాఁడనై, రుచిరం = మనోజ్ఞమైన, కల్యాణం = శుభమనెడు పరిణయమంగళమును, ఆపాదయన్ = సంపాదింపఁబోవుచు, భక్తిగుణ ఆవృతే = భక్తియను దారములతోఁ జుట్టఁబడినదియు, ముత్ అమృత ఆపూర్ణే = సంతోషము అను నీటితో నింపఁ

బడినదియు, ప్రసన్నే = స్వచ్ఛమైనదియునగు, మనఃకుంభే = మనస్సనెడు కలశ మందు, తవ = నీయొక్క, అంఘ్రిపల్లవయుగం = పాదములనెడు రెండు చిగుళ్ళను, సంవిత్ ఫలం = జ్ఞానమను కొబ్బరి బొండమును, సంస్థాప్య = స్థాపించి, సత్త్వం = సత్త్వగుణప్రధానమైన, మంత్రం = మంత్రమును, ఉదీరయన్ = ఉచ్చరించుచు, పుణ్యాహం = పుణ్యాహవాచనమును, ప్రకటీకరోమి = ప్రకటింపఁజేయుచున్నాను.

తా:- ఓ శంకరా! నా శరీరమను నింటిని శుభ్రపఱచుకొని, మనస్సున కింపైన కల్యాణము చేయఁబూని భక్తియను దారములను చుట్టి సంతోషమను నీటితో నింపిన నా మనస్సను కలశమున నీ చరణపల్లవములను, జ్ఞానమను కొబ్బరి బొండమును చేర్చి కలశస్థాపనచేసి మంత్రపూర్వక పుణ్యాహవాచనము భక్తితో నాచరింతును.

చ. తనువను గేహమల్కి, కడుదట్టపు భక్తిగుణమ్ముఁజుట్టి పే
ర్మినిఁ బ్రమదామృతం బెసఁగు హృత్కలశమ్మున, నీదు పత్కిస
మ్మును నెలకొల్పి, జ్ఞానఫలమున్ సమకూఱిచి సత్త్వమంత్రమున్
బనుపడ మంగళార్థమయి పాటిలఁజేతు శివా! శుభాహమున్. 36

అవ:- వేదసముద్రమును చిలికి పండితు లందలి సారముగా నిన్ను గ్రహింతురు సుమా యని పల్కుచున్నారు.

శ్లో. ఆమ్నాయాంబుధిమాదరేణ సుమనస్సంఘాస్సముద్యన్మనో
మంథానం దృఢభక్తిరజ్జుసహితం కృత్వా మథిత్వా తతః,
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం
నిత్యానందసుధాం నిరంతరరమాసౌభాగ్యమాతన్వతే.

టీక:- సుమనస్సంఘాః = పండితుల సమూహములు (దేవతల సమూహములు) సముద్యత్=గుణసమూహముతో నొప్పుచున్న, మనః=మనస్సును, దృఢభక్తి రజ్జు సహితం = చలింపని భక్తియను త్రాటితో కూడిన, మంథానం=కవ్వమునుగా, కృత్వా = చేసి, ఆమ్నాయ అంబుధిం = వేదసముద్రమును, ఆదరేణ = ఆదరముతో, మథిత్వా = మథించి, తతః = దానివలన, సోమం = చంద్రుని, కల్పతరుం=కల్పవృక్షమును, సుపర్వ సురభిం = కామధేనువును, చింతామణిం = చింతామణిని, ధీమతాం= బుద్ధికి సమ్మతమైన, నిత్యానందసుధాం = శాశ్వతానందమిచ్చు అమృతమును, నిరంతర రమాసౌభాగ్యం = ఎడతెగని లక్ష్మీసమృద్ధిని, ధీమతాం = బుద్ధిమంతులకు, కల్పద్రు

మం = కల్పవృక్షమువంటివాఁడును, సుపర్వ సురభిం = కామధేనువువంటివాఁడును, చింతామణిం = చింతామణి వంటివాఁడును, నిత్యానంద సుధాం = అమృతమువంటి నిత్యానందస్వరూపుడును, నిరంతర రమాసౌభాగ్యం=మోక్షలక్ష్మిసమృద్ధిస్వరూపుఁడు నగు,సోమం=ఉమాసమేతుఁడగుపరమేశ్వరుని, ఆతన్వతే=విస్తరించి పొందుచున్నారు.

తా:- దేవతలు మందర పర్వతమును కవ్వముగాఁజేసి సముద్రమును తరిచి కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, అమృతము, చంద్రుఁడు మొదలగు వానిని సంపాదించినట్లు విద్వాంసులు తమ మనస్సును కవ్వముగాఁజేసి భక్తియను త్రాడు గట్టి వేదములను మహాసముద్రమును తరిచి అందుండి భక్తులకు కల్పతరు కామధేను చింతామణుల వంటివాఁడును నిత్యానంద స్వరూపుఁడును మోక్ష లక్ష్మిసరూపుడు నగు సోమేశ్వరుని సాధించు చున్నారు.

మ. సుమనస్సంఘము సాంద్రభక్తి మయ రజ్జుస్ఫీతహృత్స్వాంతయా
మమునన్ వేదపయోధిఁద్రచ్చఁబొడమున్ సన్మాన్యహృత్ కల్పభూ
జము చింతామణి కామధేనువల భాస్వత్సోమ్ముఁ డానంద భూ
ర్యమృతాసార మెసంగ మోక్షరమయుం బ్రాంచద్గతిం జొప్పడన్.

అవ:- ఆ పరమశివచంద్రుని దర్శనముచేత ఆనంద సముద్రము పొంగి యభి వృద్ధి నొందును. అందు విబుధులకు ప్రవృత్తి గల్గునని చెప్పుచున్నారు.

శ్లో. ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్నశ్శివ
స్సోమస్సద్గణసేవితో మృగధరః పూర్ణస్తమోమోచకః,
చేతః పుష్కరలక్షితో భవతి చేదానందపాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తిస్తదా జాయతే.

టీక:- ప్రాక్పుణ్య అచల = పూర్వపుణ్యముల ప్రోవుయొక్క, (తూర్పున నుండు పుణ్యకరమైన పర్వతముయొక్క) మార్గ = మార్గమున, దర్శిత = చూపఁబడిన, సుధామూర్తిః = అమృత శరీరముగలవాఁడును, ప్రసన్నః = స్వచ్ఛమైన వాఁడును, శివః = అహ్లాదకరుఁడును, సద్గణ సేవితః = సజ్జన సమూహముచే సేవింపఁబడువాఁ డును, నక్షత్ర సమూహముచే చుట్టబడినవాఁడును, మృగధరః = లేడిని ధరించిన వాడును, పూర్ణః = అంతటను నిండినవాఁడును, తమోమోచకః = అజ్ఞానము (చీకటిని) పోగొట్టువాఁడును, సోమః = ఈశ్వరుఁడను చంద్రుఁడు, ప్రాగల్భ్యేన = ప్రౌఢిమచేత, చేతః పుష్కరలక్షితః = హృదయాకాశమందు చూడఁబడినవాఁడు, భవతిచేత్ =

అగు నేని, ఆనందపాథోనిధిః = ఆనంద సముద్రము, విజృంభతే = ఉప్పొంగుచున్నది, తదా = అప్పుడు, సుమనసాం = సంస్కరింపఁబడిన మనస్సు గలవారలకు, వృత్తిః= ఆ సముద్రమున నోలలాడ వలయునను ప్రవృత్తి, జాయతే = కలుగుచున్నది.

తా:— పురుషుఁడు పూర్వజన్మమున గడించిన యుదయ పర్వత ప్రాయంబగు పుణ్యము మీఁదుగా తన అచ్యుత శరీరము భక్తుల కగపఱచి ప్రసన్నుఁడు ఆనంద మయుఁడునై నక్షత్రములట్లు సజ్జన బృందములు చుట్టుకొని సేవింప మృగధరుఁడును, పరిపూర్ణుఁడును, తమోనివారకుఁడునగు చంద్రుడుంబోలె హృదయాకాశమందు సోమేశ్వరుఁడు పరమ ప్రబోధముతో వెలుగొందె నేని ఆనంద సముద్రముప్పొంగును. అప్పుడు శుద్ధాంత రంగులగు విబుధుల చిత్తము రంజిల్లును.

సీ. ప్రాక్పుణ్య శైలేంద్ర పథదర్శితుండౌచు
వెల్గు నిర్మల సుధావిగ్రహుండు
సతతంబుఁ బార్శ్వదేశంబులఁ బేంపారు
సద్గణమ్ములఁ దేర్చు సత్త్వయుతుఁడు
అభితః పరివ్యాప్తి నతిగాఢమగుతమః
కాండంబు నణచు ప్రకాశమయుఁడు
మృగధరుం డమలుండు మిగుల సంపూర్ణుండు
నుతకలాఢ్యుఁడు ప్రసన్నుండు శివుఁడు

గీ. సోముఁ డాత్మాంబరోప లక్ష్యుండు గాఁగ
తోన నుప్పొంగు నానంద తోయరాశి
మానకప్పట్ల సుమనోవితానమునకు
సమధికంబుగ సమకూరు సత్ప్రవృత్తి. 38

అవ:— ఒక నగరమున మంచి రాజుండుటచే దేశమునకు సర్వ సమృద్ధి గలిగి నట్లు హృదయ పుండరీకమందు పరమేశ్వరుఁడుండుటచే నాకు సర్వ సమృద్ధియు గల్గినదని చెప్పుచున్నారు.

శ్లో. ధర్మో మే చతురంఘ్రికః సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగళితాః కాలాస్సుఖావిష్కృతః,

జ్ఞానానందమహౌషధిస్సుఫలితా కైవల్యనాథే సదా
మాన్యే మానసపుండరీకనగరే రాజావతంసే స్థితే.

టీ:- రాజావతంసే = చంద్రుఁడు శిరోభూషణముగా గలవాఁడును (రాజశ్రేష్ఠుఁడును) మాన్యే = సర్వపూజ్యుఁడును, సర్వసమ్మతుడునగు శివుఁడు (రాజు) మే = నాయొక్క, మానస పుండరీక నగరే = కమలమువంటి మనస్సనెడు నగరమందు, కైవల్యనాథే = కైవల్యముతో కూడిన ప్రభువై, స్థితే = ఉండగా, చతురంఘ్రికః = నాలుగు పాదములు గల్గిన, ధర్మము = ధర్మము, సుచరితః = సుఖముగా నాచరింపఁబడినది, పాపం = పాపము, వినాశం = నాశనమును, గతం = పొందినది, కామక్రోధ మదాదయః = కామ, క్రోధ, మోహ, మద, మాత్సర్యము లనునవి, విగళితాః = తొలఁగిపోయినవి, కాలాః = కాలములు, సుఖావిష్కృతాః = సుఖమును ప్రకటించు చున్నవి, జ్ఞానానంద = జ్ఞానసాధన గ్రంథ బాహుళ్యమనెడు, మహౌషధిః = సిద్ధి సాధనమైన ఓషధి, సదా = ఎల్లపుడు, సుఫలితా = చక్కగా ఫలించినది, భవతి = అగుచున్నది.

తా:- ధార్మికుఁడైన రాజు స్వతంత్రుఁడై నగరమందుండి పరిపాలించుచుండగా దోషములు పోయి భూమి ఫలవంతమై సర్వసమృద్ధి గలిగినట్లు నా హృదయ పుండరీకమందు పరమేశ్వరుఁడు మోక్షాధి నాథుఁడై నివసించియుండ నాకు అరిషడ్వర్గము తొలగిపోయి, జ్ఞాన సాధనములనెడు ఓషధులు ఫలించి సదా సుఖము గల్గినది.

మ. కడుఁ గైవల్య మొసంగు దిట్ట, బుధవర్గంబెన్ను రాజావతం
సుఁడు మన్మానస రాజధాని నెసఁగన్ సూర్జచ్ఛతుష్పాదమై
నడచెన్ ధర్మ, మఘమ్మడంగెఁ దెగి రంతశ్శత్రువుల్ కాలముం
గడచెన్ సౌఖ్యముగా, ఫలించెను మహానందౌషధి శ్రేష్ఠముల్. ౩౯

అవ:- ఉదాహరింపబడు ఫలంబు పొంది యున్నందున నాకు దుర్భిక్షము వలని భయము లేదనుచున్నారు.

శ్లో. ధీయంత్రేణ వచోఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై
రానీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశి దివ్యామృతైః,
హృత్కేదారయుతాశ్చ భక్తికలమాస్సాఫల్యమాతన్వతే
దుర్భిక్షాన్మమ సేవకస్య భగవన్విశ్వేశ భీతిః కుతః?

టీక:— హే భగవన్ = ఓ భగవంతుఁడా! హే విశ్వేశ! ధీయంత్రేణ = బుద్ధి యను మోటతో, వచోఘటేన = వాక్కు లను బొక్కెనచేత, కవితాకుల్యోపకుల్యాక్రమైః = కవిత్వ మనెడు కాలువలు పిల్లకాలువలు మొదలగు వానిగుండ, ఆనీతైః = తీసికొని రాఁబడిన, సదాశివస్య = పరమ శివునియొక్క, చరితాంభోరాశి = చరిత్రలనెడు సముద్రముయొక్క, దివ్యామృతైః = మంచినీళ్ళచేతను, హృత్కేదారయుతాః = హృదయమను పొలమున పుట్టియున్న, భక్తికలమాః = భక్తియను వరిపైరులు, సాఫల్యం = పంటను, ఆతన్వతే = విస్తరించుచున్నవి, సేవకస్య = నీ సేవకుఁడనగు, మమ = నాకు, దుర్భిక్షాత్ = కఱవు వలన, భీతిః కుతః = భయము ఎక్కడిది?

తా:— శంకరా! నీ చరిత్రయను మహాసముద్రములోని దివ్యామృతము కవిత్వ మను కాలువలు పిల్లకాలువలు మొదలగు వాని గుండ వాక్కనెడు బొక్కెనతో నా బుద్ధి యను మోటవలన హృదయమను పొలములోనికి ప్రవహించి భక్తి యను సస్యమును ఫలవంతముగా చేయుచున్నది. ఇంక ఎంత కఱవు వచ్చినను నాకేమి భయము?

మ. మతి యేతాముగ, వాక్కు బొక్కెనగ, రమ్యంబౌ కవిత్వంబు వి
స్తృత కుల్యాళిగఁ బాఱు నీ విమల చారిత్రాబ్ధి చంచన్మహా
మృతముం గ్రోలి, హృదుర్వి, భక్తియను పైరెల్లప్డుడుం బండ, నీ
శ్రితులౌ వారికిఁ గాటకంబు గలదే? శ్రీ పార్వతీ వల్లభా! 40

అవ:— ఈ క్రింది విషయములయందు మూఁగతనము చెవిటితనము మున్నగునవి రాకుండఁ జేయుమని వేడుకొనుచున్నారు.

శ్లో. పాపోత్పాత విమోచనాయ రుచిరైశ్వర్యాయ మృత్యుంజయ
స్తోత్రధ్యాననతి ప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే,
జిహ్వాచిత్తశిరోంఘ్రిహస్తనయన శ్రోత్రైరహం ప్రార్థితో
మామాజ్ఞాపయ తన్నిరూపయ ముహుర్మామేవ మా మేఽవచః.

టీక:— హే మృత్యుంజయ = మృత్యువును జయించినవాఁడా! పాపోత్పాత విమోచనాయ = పాపంబను ఉత్పాతమును బాపుటకొఱకు, రుచిరైశ్వర్యాయ = ఇష్టమైన ఐశ్వర్యము కొఱకును, స్తోత్ర = స్తోత్రము చేయుట, ధ్యాన = ధ్యానించుట, నతి = నమస్కారము చేయుట, ప్రదక్షిణ = ప్రదక్షిణము చేయుట, సపర్యా = పూజ చేయుట, ఆలోకన = చూచుట, ఆకర్ణనే = వినుట, వీని విషయమై, జిహ్వా = నాలుక

చేతను, చిత్త = మనస్సుచేతను, శిరః = శిరస్సుచేతను, అంఘ్రి = పాదముల చేతను, హస్త = చేతులచేతను, నయన కన్నులచేతను, శ్రోత్రైః=చెవులచేతను, అహం = నేను, ప్రార్థితః = ప్రార్థింపఁబడితిని, మాం = నన్ను, ముహుః = మాటిమాటికి, తత్ = ఆ స్తోత్రము మొదలైన వానినిఁ గూర్చి, ఆజ్ఞాపయ = ఆజ్ఞాపింపుము, నిరూపయ = పురి కొల్పుము, మే = నాకు, అవచః = మూఁగతనము, మైవ = కలుగనీయకుము.

తా:-పరమేశ్వరా! పాపములు నశించి ఇష్టములు సిద్ధించుటకు పరమేశ్వరుని స్తుతింపుమని నాలుకయు, ధ్యానింపుమని మనస్సును నమస్కరింపుమని శిరస్సును, ప్రదక్షిణము చేయుమని పాదములను పూజింపుమని చేతులును, చూడుమని కన్ను లును, కథలు వినుమని చెవులును నన్ను కోరుచున్నవి. నీయాజ్ఞ లేనిదే ఆ కోరిక నెఱ వేర్పలేను. అట్లు చేయుటకు నన్నుల వఱపుము. మూఁగతనము, మతిలేమి, కుంటి గ్రుడ్డి తనము మొదలగునవి నాకు రాకుండఁ జూడుము.

మ. ఘనపాపంబు లడంగి భూరి శుభ సంఘంబుల్ ఘటిల్లంగ నీ
ప్రణుతి ధ్యాననతి ప్రదక్షిణ సపర్యాదర్శనా కర్ణనా
ద్యనవద్య క్రియలాచరింప రసనా స్వాంతోత్తమాంగాంఘ్రి ము
ఖ్య నిజాంగబులఁజొన్పి మ్రొక్కెడిఁద్వదాజ్ఞా ప్రేరణాప్తిన్ జయిం
తును గల్పింపకు మఁగవిక్రియల నిందున్నాకు మృత్యుంజయా! 41

అవ:- ఈశ్వరుఁడు దుర్గాతి ప్రియుఁడు గావునఁ దనమనోదుర్గమున నివసింపు మని వేఁడుచున్నారు.

శ్లో. గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమశ్చాప్తబలం ఘనేంద్రియచయోద్వారాణి దేహస్థితః,
విద్యా వస్తుసమృద్ధిరిత్యఖిలసామగ్రీసమేతే సదా
దుర్గాతిప్రియ దేవ మామకమనోదుర్గే నివాసం కురు.

టీక:- హే దుర్గాతిప్రియ = పర్వత దుర్గమందు ప్రీతిగలిగిన, హేదేవ = ఓ పరమశివుఁడా! పరిఖాపదం = అగడ్తకు లక్షణమైన, గాంభీర్యం = లోతును, ఘన ధృతిః = దిట్టమైన ధైర్యము; ప్రాకారః = కోటగోడయును, ఉద్యత్ గుణస్తోమః = పుట్టుచున్న సద్గుణపుంజము, ఆప్తబలం = నమ్మకమైన బలమును, దేహస్థితః = శరీర మునందున్న, ఘనేంద్రియచయాః = కన్ను మొదలగు నింద్రియములు, ద్వారాణి = రాక

పోకలకు ద్వారములును, విద్యా = ఈశ్వరజ్ఞానము, వస్తు సమృద్ధిః = పదార్థ సంపద యు, ఇతి = ఇట్లు, అఖిలసామగ్రీసమేతే = దుర్గమునకు కావలసిన పదార్థములన్నియు సంపూర్ణముగానున్న, మామక మనోదుర్గే = నా మనస్సను దుర్గమందు, సదా = ఎప్పు డును, నివాసం = నివాసమును, కురు = చేయుము.

తా:— దుర్గమంబగు కైలాస పర్వతమున ప్రీతితో నివసించుచున్న దేవా! నా మనంబు గాంభీర్య మగడ్తగను, ధైర్యము ప్రాకారముగను, ఉదయించు సుగుణం బులు బలంబుగను, చక్షురాదింద్రియములు ద్వారములుగను, పరమ శివజ్ఞానము సకల పదార్థ సంపదగను దుర్గలక్షణ సమగ్రంబైయున్నది. దుర్గప్రియుండవు గాన నీవిందు నివసింపుము.

ఉ. పేరుటగడ్త చిహ్నము గభీరత; ప్రావరణమ్ము ధైర్య మా
ధార బలమ్ము సద్గుణ కదంబము ద్వారము లింద్రియాళి జ్ఞా
నేరిత విద్య వాస్తవ సమృద్ధియుఁగా విలసిల్లుఁ జూడు దు
ర్గారమణా! మదీయహృదయంబను దుర్గము నిల్వుమయ్యెడన్. 42

అవ:— పరమ శివుఁడాది కిరాతమూర్తి యగుటఁ దలంచి కిరాత వాంఛితము లన్నియు నాయందున్నవిగాన మఱెందును బోవలదని వేఁడుచున్నారు.

శ్లో. మా గచ్ఛస్త్వమిత స్తతో గిరిశ భో మయ్యేవ వాసం కురు
స్వామిన్నాదికిరాత మామకమనఃకాంతారసీమాంతరే,
వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్యమోహాదయ
స్తాన్హత్వా మృగయావినోదరుచితాలాభంచ సంప్రాప్స్యసి.

టీక:— హే ఆదికిరాత = తొల్త బోయరూపము ధరించినవాఁడా! భోగిరీశ = ఓ కైలాసవాసా! స్వామిన్! త్వం = నీవు, ఇతస్తతః = ఇటునటు, మాగచ్ఛః = పోకుము, మయ్యేవ = నాయందే, వాసం కురు = నివాసము చేయుము, మామక మనః కాంతారసీమాంతరే = నా మనస్సను అరణ్యము ప్రదేశమున, మదజుషః = గర్వముతో కూడిన, మాత్సర్యమోహాదయః = మాత్సర్యము మోహము మొదలగు, మృగాః = జంతు వులు, బహుశః = అనేకములుగా, వర్తంతే = తిరుగుచున్నవి, తాన్ = వానిని, హత్వా = చంపి, మృగయా వినోద రుచితాలాభంచ = వేఁటతో కాలము గడుపుట యందలి కోరిక యొక్క ఫలితమును, సంప్రాప్స్యసి = పొందగలవు.

తా:— ఓ ఆది కిరాతమూర్తీ! నీ వెందునుబోక నామనస్సునందే యుండుము. నా మనస్సొక మహారణ్యము. అందు కామక్రోధాదులను క్రూర మృగము లనేక మున్నవి. వాని వేటాడి. వేట యందలి నీ యానందమును దీర్చికొందువు.

ఉ. పోవకు మిందునందుఁదొలి బోయఁడ! నా యెడనే యనారతం
బీవు వసింపు మీశ! కల వెన్నియొ మోహమదాదిఘోర స
త్త్వవళు లస్మదీయ హృదయాటవియం దలవానిఁ జెందుచుఁ
దేవ! యథేష్టముగ్ బడయనేరుతు వమ్మృగయావినోదమున్. 43

అవ:— మహాదేవుని సింహరూపముగాఁ గొనియాడుచున్నారు.

శ్లో. కరలగ్నమృగః కరీంద్రభంగో
ఘనశార్దూలవిఖండనోఽస్తజంతుః,
గిరిశో విశదాకృతిశ్చ చేతః
కుహరే పంచముఖోఽస్తి మే కుతో భీః ?

టీః:— కరలగ్నమృగః = చేతనిఱికిన మృగముగలవాఁడును, కరీంద్రభంగః = గజాసురుని భంగపఱచినవాఁడును, ఘనశార్దూల విఖండనః = గొప్పవ్యాఘ్రాసురుని ఖండించినవాఁడును, అస్తజంతుః = తనయందు లీనమగు ప్రాణికోటి గలవాఁడును, గిరిశః = పర్వతమందు శయనించువాఁడును, విశదాకృతిః = తెల్లని శరీరకాంతి గల వాఁడును, పంచముఖః = ఐదు ముఖములు గలవాఁడును అగు పరమేశ్వరుఁడను సింహము, మే = నాయొక్క, చేతఃకుహరే = చిత్తమను గుహయందు, అస్తి = కలదు, మే = నాకు, భీః = భయము, కుతః = ఎక్కడిది?

తా:— మహాదేవుఁడగు శివుఁడు సింహమువలె నా చిత్తకుహరమునందు నివసించి యుండగా నా కేభయమునులేదు.

కం. గ్రస్త ద్విపి ద్విరదుం
డస్తాఖిల జంతుఁడు మృగహస్తుఁడు చేత
శ్శస్త గుహను పంచాస్యుఁడు
వాస్తవ్యుండయ్యె నెచటి భయ మిఁక నాకున్. 44

అవ:—పరమ శివునియొక్క పాదద్వంద్వమను పక్షిగూటిలో తన చిత్తమను పక్షి విహరించుటను గోరుచున్నారు.

శ్లో. ఛందశ్శాఖిశిఖాన్వితైర్ద్విజవరైస్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలైర్దీపితే,
చేతఃపక్షిశిఖామణే త్యజ వృథా సంచారమన్యైరలం
నిత్యం శంకరపాదపద్మయుగళీనీడే విహారం కురు.

టీక:— హే చేతఃపక్షి శిఖామణే = మనస్సనెడు పక్షిశ్రేష్ఠమా! ఛందశ్శాఖి శిఖా = వేదములనెడు వృక్షములయొక్క కొమ్మల చివరలతో, అన్వితైః = సంబంధించిన, ద్విజవరైః = బ్రాహ్మణ శ్రేష్ఠులచేత (పక్షిశ్రేష్ఠములచే) సంసేవితే = ఆశ్రయింపఁ బడినదియు, శాశ్వతే = నిత్యమైనదియు, సౌఖ్యాపాదిని = సౌఖ్యమును కలిగించునదియు, సుధాసారైః = అమృత రసముగల, ఫలైః = ఫలములతో, ఖేదభేదిని = సంసార దుఃఖమును పోఁగొట్టునదియు, దీపితే = ప్రకాశవంతమైన, శంకర పాదపద్మయుగళీనీడే = ఈశ్వరుని పాదపద్మ ద్వంద్వమను గూటియందు, విహారం = విహారమును, కురు = చేయుము, అన్యైః = ఇతరులతో, అలం = చాలును, వృథా = నిష్ఫలమైన, సంచారం = సంచారమును, త్యజ = విడువుము.

తా:— ఓ మనస్సనెడు పక్షీ! ఇటునటు తిరిగి యేల శమపడియెదవు. పరమేశ్వరుని పాదద్వంద్వము చక్కనిపక్షిగూడు. దానికెన్నడును చలనములేదు. అందు మంచి వెలుతురుగలదు. అది మిక్కిలి సౌఖ్య మిచ్చును. అమృతఫలముగల్గి దుఃఖ నివారకమై యున్నది. అందు విహరించి యానందింపుము. అనేక ద్విజసత్తము లాయా శాఖాగ్రములకు సంబంధించియుండి దాని నాశ్రయించుచుందురు.

మ. శ్రమ సంహారకమై, సదాసుఖదమై చంచద్ద్విజానీతమై
యమృతాన్యాన ఫలాఢ్యమై యమరు నయ్యామ్నాయ భూజంపుట
గ్రమునంబొల్చు శివాంఘ్రి నీడమున నశ్రాంతంబు స్వేచ్ఛావిహా
రము గావింపు మనోవిహంగమ శిరోరత్నంబ! వేడ్కటికిన్. 45

అవ:— మానసరాజహంసకు గౌరీపతియొక్క పాదసౌధాంతరాళమునందు నివాసము విధించుచున్నారు.

శ్లో. ఆకీర్ణే నఖరాజికాంతివిభవైరుద్యత్సుధావైభవై
రాధౌతేఽపి చ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే,

నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు
స్థిత్వా మానసరాజహంస గిరిజానాథాంఘ్రిసౌధాంతరే.

టీక:- హే మానసరాజహంస = ఓ మనస్సను రాజహంసమా ! నఖరాజికాంతి విభవైః = గోటిసమూహముయొక్క కాంతి అతిశయములచే, ఆక్లిన్నే = నిండియున్నదియు, ఉద్యత్సుధాపైభవైః = దినదినము వృద్ధిపొందుచున్న చంద్రుని అమృతకిరణములు వ్యాపించుటచే, ఆధౌత=శుభ్రపడినదియు, అపిచ=మరియును, పద్మరాగలలితే = పద్మముల ఎఱుపువంటి యెఱుపుతో ఒప్పునదియు, హంసవ్రజైః = హంసలగుంపుచే, ఆశ్రితే=సేవింపఁబడినదియు అగు, గిరిజానాథాంఘ్రి సౌధాంతరే = పార్వతీపతియొక్క పాదంబను మేడలో, రహసి = రహస్యమందు, భక్తివధూగణైస్సహ = భక్తియను భార్యలతో కూడ, నిత్యం = ఎప్పుడును, స్వేచ్ఛావిహారం = ఇష్టమైన సంచారమును, కురు = చేయుము.

తా:- ఓ మానసరాజహంసమా ! నీవు పార్వతీకాంతుని పాదంబను సౌధాంతరాళమున భక్తి కాంతాసమేతవై స్వేచ్ఛావిహారము ననుభవించి యానందింపుము.

చ. విమల నఖ ప్రభావిభవ విస్తృతమై సుధచేతధౌతమై
సుమహిత పద్మరాగరమ సొంపయిహంసలు మూగు నయ్యుమా
రమణు పదాలయస్థలిఁది రమ్మయి యేకత మిష్టకేళి ని
త్యము విహరింపు భక్తివనితారతి మానస రాజహంసమా! 46

అవ:- హృదయారామమునం దుద్యానలక్షణములు గలవని యనుచున్నారు.

శ్లో. శంభుధ్యానవసంతసంగిని హృదారామేఽఘజీర్ణచ్ఛదా
స్స్రస్తా భక్తిలతాచ్ఛటావిలసితా పుణ్యప్రవాళ శ్రితాః,
దీప్యంతే గుణకోరకా జపవచఃపుష్పాణి సద్వాసనాః
జ్ఞానానందసుధామరందలహరీసంవిత్ఫలాభ్యున్నతిః.

టీక:- శంభుధ్యాన=ఈశ్వరధ్యానమను, వసంతసంగిని = వసంతఋతుసంబంధము గల, హృదారామే = హృదయంబను పూవులతోటయందు, స్రస్తాః = రాలిపోయిన, అఘజీర్ణచ్ఛదాః = పాపములను పండుటాకులును, విలసితాః = ప్రకాశమానములైన, పుణ్యప్రవాళశ్రితాః = పుణ్యములను చిగురుటాకులను పొందినవియును, గుణకోరక

కాః = సద్గుణములను మొగ్గలుగలవియు, జపవచఃపుష్పాః = జపవాక్కులను పూలు గలవియు, సద్వాసనాః = సత్కర్మసంస్కారములనుసు వాసనలుగలవియు, భక్తిల తాచ్ఛటాః = భక్తియనుతీగ జొంపములును, జ్ఞానానంద సుధామరందలహరీ = జ్ఞానము ఆనందము అను అమృతమకరందములయొక్క ప్రవాహము, సంవిత్ఫలాభ్యున్నతిః = బ్రహ్మజ్ఞానమను ఫలాభివృద్ధియును, దీప్యంతే = ప్రకాశించుచున్నవి.

తా:—ఓదేవా! మీ ధ్యానవసంతము సంప్రాప్తమగుటచే నామనస్సను పూలతోటలో పాపము లన్నియు పండుటాకులుగా రాలినవి. పుణ్యములు చిగురుటాకులుగా మొలకలెత్తినవి. వానిపై సద్గుణములు మొగ్గలుగా బయలుదేరినవి. భక్తిలతలు సాగుచున్నవి. అందు జపవచనంబులు పుష్పములుగా నుదయించినవి. సత్కర్మసంస్కారములు సువాసన వెదజల్లుచున్నవి. జ్ఞానానందములు అమృతమకరందములుగా ప్రవహించుచున్నవి. బ్రహ్మజ్ఞానము ఫలముగా స్ఫురించుచున్నది. కనుక నాహృదయమారామను మనఁదగి యున్నది.

మ. గిరిశధ్యానవ సంతసంగతిని హృత్కేళీవనిఁ భక్తి వ
ల్లి రహిఁల్లెఁ దురితౌఘ జీర్ణదళపాళిన్ రాల్చి, పుణ్యప్రవా
ళరమఁ సద్గుణకోరకాళిని, జపాలాప ప్రసూనాప్తి, స
త్సురభిన్, జ్ఞానసుధా మధూర్మిని సువిస్ఫోరద్యత్ఫలాభ్యున్నతిన్. 47

అవ:—పరశివధ్యాన ముత్తమఫలదాయకమని బోధించి యితరదేవతాశ్రయణము నుండి మనస్సును మరలించుచున్నారు.

శ్లో. నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతమ్,
శంభుధ్యానసరోవరం వ్రజ మనోహంసావతంస స్థిరం
కిం క్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమం ప్రాప్స్యసి ?

టీక:—హే మనోహంసావతంస = ఓ మానసరాజహంసమా! నిత్యానంద = శాశ్వతానందమను, రస = ఉదకమునకు, ఆలయం = ఉనికిపట్టును, సుర = దేవతలయొక్కయు, ముని = పరమహంసలయొక్కయు, స్వాంత = హృదయములను,

అంబుజాత = పద్మములకు, ఆశ్రియం = ఆధారమును, స్వచ్ఛం = నిర్మలమును, సద్ద్విజసేవితం =యోగ్యులైన ద్విజులచేత (రాజహంసలచే) సేవింపఁబడినదియు, కలుషహృత్ = పాపహరమును, సద్వాసనా=సత్కర్మలవాసనలచే, ఆవిష్కృతం = ప్రకటింపఁబడినదియునగు, శంభుధ్యాన = ఈశ్వరధ్యానమను, సరోవరం = మంచి సరస్సును, స్థిరం=స్థిరమైనదానిని, వ్రజ = పొందుమా ! క్షుద్రాశ్రయ = అల్పుల నాశ్రయించుటయను, పల్వలభ్రమణ = పడియలనుగుఱించిన త్రిప్పుటచేత, సంజాత = పుట్టిన, శ్రమం = ఆయాసమును, కిం ప్రాప్స్యసి=ఏలపొందెదవు ?

తా:_ ఓ మనోరాజహంసమా ! క్షుద్రదేవతల నాశ్రయించుటవలన కొన్ని పాపములు తొలగిన తొలగుగాక ! శాశ్వతానందము చేకూరదు. శంభుధ్యానము చేయుము. అదిగొప్ప సరోవరము. సత్కర్మసంస్కారమునగాని లభింపదు.

మ. నిరతానంద రసాలయంబు, సురమౌనిస్వాంత పద్మాశ్రయం
బు, రణత్సద్ద్విజ సేవితంబు, ననఘుంబుం, బూర్వ సద్వాసనా
స్ఫురణోత్పన్న సదాశివస్మృతి సరస్సుం జేరి క్రీడింపు, ము
ద్దురనీచాశ్రయఖేదమందకుము చేతోహంసవంశేశ్వరా! 48

అవ:_ శివభక్తి లభ్యమగు ఫలమును గోరుచున్నారు.

శ్లో. ఆనందామృతపూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్నముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా,
ఉచ్చైర్మానసకాయమానపటలీమాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతు మే సత్కర్మ సంవర్ధితా.

టీక:_ ఆనందఅమృత = ప్రేమయను ఉదకములో, పూరితా = నింపబడినదియు, హర = శివునియొక్క, పదాంభోజ = పాదపద్మమును, ఆలవాల = పాదునుండి, ఉద్యతా = పుట్టిపెరిగినదియు, స్థైర్య = చిత్తస్థైర్యంబను, ఉపఘ్నం = ప్రాఁకను, ఉపేత్య = పొంది, శాఖోపశాఖాన్వితా = చిలవలుపలవలు పొందుకొనినదియు, ఉచ్చైః = ఉన్నతమైన, మానస = మనస్సును, కాయమాన = పందిళ్ళయొక్క, పటలీం = సమూహమును, ఆక్రమ్య=అలముకొని, నిష్కల్మషా=చీడ మొదలగువానిచే శిథిలముగాక, సత్కర్మసంవర్ధితా = పురాకృతపుణ్యకర్మములచేత వృద్ధి

పొందింపబడినవియునగు, భక్తిలతికా = భక్తియనుతీగ, మే = నాకు, నిత్యాభీష్ట ఫలప్రదా = శాశ్వతమైన నాయభీష్టఫలము నిచ్చునది, భవతు = అగుగాక !

తా:- ఈశ్వరసేవానురక్తి నీరుపోతగను శివుని పాదపద్మములను పాదుగను, చిత్తస్థైర్యము ప్రాకుడుకంపగను చక్కగా బయలుదేరి చిలవలుపలవల నల్లుకొనుచు క్రమముగా నున్నతమైన నామనస్సను పందిరి యంతట నలముకొని చీడ మొదలగు దోషములచే చెడిపోకుండనున్న యీభక్తిలతను పురాకృతపుణ్యకర్మ యను దోహదముచే పెంపొంది నామనోభీష్టమగు శాశ్వతఫలంబు ఫలించునుగాక !

చ. హరచరణమ్మపాదు, ప్రమదామృత మంచితధార, స్థైర్య వి
స్తరణము పట్టు, నెమ్మనము చాలిన పందిరిగాగ, సత్క్రియా
బరపయి పేర్చు భక్తిలతపర్వెడు కొమ్మల రెమ్మలం, బ్రభా
స్వరమయి నా కభీష్టఫలవర్గము లిచ్చునుగాత నిచ్చలున్. 49

అవ:- ఇప్పుడు శ్రీశైలవాసియగు భ్రమరాంబికాసమేత మల్లికార్జును భజించుచున్నారు.

శ్లో. సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితం
స ప్రేమభ్రమరాభిరామమసకృత్సద్వాసనాశోభితమ్,
భోగీంద్రాభరణం సమస్తసుమనఃపూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శివాలింగితమ్.

టీక:- సంధ్యారంభ = సాయంకాలమందు, విజృంభితం = తాండవనృత్యమున విజృంభించునట్టియు (పుష్పములు వికసించునదియు), శ్రుతిశిరస్థానాంతర = వేదములకు శిరస్థానములైన ఉపనిషత్తులను ఇతరస్థలమందు (చెవులయందును తలమీదను), అధిష్ఠితం = బోధ్యముగానున్నదియు (అలంకారముగా నున్నదియు) స ప్రేమ = ప్రేమతోకూడిన, భ్రమరా = భ్రమరాంబికచేతను (తుమ్మెదలచేతను) అభిరామం = మనోహరమైనట్టియు, అసకృత్ = ఎల్లప్పుడును, సద్వాసనా = సాధువులయొక్క భావనచేత (మంచి సువాసనచేత), శోభితం = ఒప్పునట్టియు, భోగీంద్ర = వాసుకి (భోగవంతులకు), ఆభరణం = భూషణముగా గలిగినట్టియు (భూషణమైనట్టియు) సమస్తసుమనః = ఎల్లదేవతలచేతను (విద్వాంసులచేతను) (సకలపుష్పముల

కంటెను) పూజ్యం = పూజింపఁదగినట్టిదియు, గుణ = సత్త్వగుణముచేత (సుగంధ గుణముచేత) ఆవిష్కృతం = ప్రకటితమైనట్టియు, శివాలింగితం = పార్వతీదేవిచేఁ కౌఁగిలించుకొనబడిన, శ్రీగిరి = శ్రీశైలమందున్న, మల్లికార్జున = మల్లెతీగ అల్లుకొన్న మద్దిచెట్టును పోలిన, మహాలింగం = మహాలింగమును, సేవే = భజించుచున్నాను.

తా:— శ్రీశైలపర్వతమందున్న మల్లికార్జున మహాలింగము మల్లెతీగ అల్లుకొన్న మద్దిచెట్టుతోఁ పోల్చి వర్ణింపఁబడినది. ఈశ్వరుఁడు సాయంకాలమున తాండవనృత్యముతోఁ భక్తుల నానందపఱచును. అది పుష్పవికాసములతోఁ తాండవించి యానందపఱచును. శివుఁడు శ్రీశైలమందుఁగాక ఉపనిషత్తుల యందుండును. దానిపుష్పములు శ్రవణములయందు శిరస్సులయందు అలంకారములుగా నుండును. మల్లికార్జునుఁడు భ్రమరాంబతోఁడను అర్జునవృక్షము భ్రమరములతోఁడనుగూడి యొప్పును. ఈశ్వరునకు పద్యాసనయనగా సాధుభావనయొక్క శోభయు, దానిసువాసనయొక్క శోభయుగలదు. భోగీంద్రుఁ డనగా శేషాహిశివుని యాభరణము. భోగీంద్రు లనగా మహాభోగవంతులకు దానిపూల లంకారములు. శివుఁడు సుమనఃపూజ్యుఁ డనగా సర్వదేవతలచేతను పూజింపబడువాఁడు. దానిపుష్పంబు లన్ని పుష్పములకంటెను మిక్కిలి శ్లాఘనీయములు. భగవంతుఁడు సత్త్వమువలన తెలియబడును. అది సుగంధగుణమున తెలియనగును. అట్టిమల్లికార్జునదేవుని భజించెదను.

మ. శ్రుతి శీర్షాంతర వర్తియై గుణతతుల్ శోభిల్ల సంధ్యా విజృం
భితమై సద్భ్రమరాభిరమ్యమయి ప్రోన్మీలత్సదా వాసనాం
చితమై భోగివిభూషణమ్మయి శివాశ్లేష ప్రకారోపలా
లితమౌ శ్రీగిరిమల్లికార్జున మహాలింగంబు సేవించెదన్. 50

అవ:— భ్రమరాంబాపతిని భ్రమరపతిగా నిరూపించి తన మనఃపద్మమునందు విహరించుటకు వేఁడుకొనుచున్నారు.

శ్లో. భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహాసితవపుః పంచేషుణా చాదృతః,
సత్పక్షస్సుమనోవనేషు సపున స్సాక్షాన్మదీయే మనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః.

టీక:- భృంగి = భృంగియను ప్రమథునియొక్క (భృంగజాతియొక్క) ఇచ్ఛా= అభిప్రాయముచేత (అపేక్షచేత) నటన = వర్తించుటయందు, (అనుకరించుటయందు, ఉత్కటః = ఉత్కటేచ్ఛగలిగినట్టి, కరిమద = గజాసురుని గర్వమును (ఏనుఁగుమదమును) గ్రాహీ = అణచిపట్టినట్టి (గ్రహించుస్వభావము గల్గినట్టి) స్ఫురత్ = ప్రకాశించుచున్న, మాధవ = మాధవునియందు (వసంతమందు) ఆహ్లాదః = ఆనందము గలిగినట్టియు, నాదయుతః = ప్రణవనాదప్రతిపాద్యుడైనట్టియు (ఝుంకారముతో కూడినట్టియు) మహత్ = గొప్ప, అసితవపుః= తెల్లనిశరీరముగల్గినట్టియు (సితవపుః= నల్లనిశరీరము గలిగినట్టియు) పంచేషుణా = మన్మథునిచేత, ఆదృతః = బాణలక్ష్యముగను, (సహాయముగను) ఆదరింపబడినట్టియు, సుమనః = దేవతలయొక్క (విద్వాంసులయొక్క) అవనేషు = రక్షణములందు, (సుమనోవనేషు=పూలతోఁటలయందు) సత్పక్షః = ఉన్న అభిమానము గలిగినట్టియు, సాక్షాత్ = కనులయెదుటనున్నట్టియు, శ్రీశైలవాసీ = శ్రీశైలమందు నివసించునట్టియు, విభుః = పలువిధములగుచున్నట్టియు, భ్రమరాధిపః = భ్రమరాంబాపతియనునట్టి భృంగరాజము, మదీయే = నా సంబంధమైన, మనోరాజీవే = హృదయపద్మమందు, విహరతాం = విహరించుగాక !

తా:- శ్రీశైలవాసీ ! భ్రమరాంబాధిపతీ ! నీవు భ్రమరాధిపతివి అనగా తుమ్మెదఱేఁడు గావున నామనఃపద్మమున సంచరింపుము. నీవు భక్తుఁడగు భృంగీశ్వరుని యిచ్ఛానుగుణముగా వర్తింపఁజాలుదువు. తుమ్మెదఱేఁడు భృంగియనగా తుమ్మెదలజాతి దాని యపేక్ష ననుసరించి నడచును. నీవు గజాసురుని గర్వము నిగ్రహించితివి. అది ఏనుగుల మదోదకము గ్రహించును. నీకు మోహినీరూపము ధరించిన మాధవునియం దాహ్లాదము స్ఫురించినది. దానికి మాధవ అనగా వసంతమునం దాహ్లాదము. నీకు ప్రణవనాదము. దానికి ఝుంకారనాదము. మన్మథుడు నిన్ను పుష్పబాణముతో నాదరించెను. దానిని సహాయముగా నాదరించెను. నీకు (సుమనోఽవనము) విబుధరక్షణమం దభిమానము. దానికి (సుమనోవనము) పూలతోఁటయం దభిమానము. కాబట్టి నామనఃపద్మమం దెడబాయకుండుట సహజమేకదా !

సీ. భృంగీష్టభంగిఁ జెలంగు నేర్పునటనంబు
కరి మదంబును బీల్చు కౌశలంబు
స్ఫురితమాధవ కళంగెరలు నాహ్లాదంబు
మోదప్రదంబైన నాదభరము

పంచబాణునిచేతి పరమాదరపులబ్ధి
తను సంగతమహాసితత్వశోభ
సుమహితసుమనోవనములందుఁ బ్రసరించు
మానితానూనాభిమానగరిమ

సీ. మొలయ శ్రీపర్వతము వాసతలముగాఁగ
మెలఁగుచుం గట్టెదుటఁ దోఁచు మేటిమూర్తి
యల్లభ్రమరేశ్వరుఁడు మన్మనోజ్ఞవీధి
సంతతమ్ము విహారమ్ము సలుపుఁగాత! 51

అవ:—మేఘముగా భావించిన శంకరుని నాచిత్తచాతకంబు కోరుచున్నదని చెప్పుచున్నారు.

శ్లో. కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యాసస్యఫలోదయాయ సుమనస్సంసేవ్యమిచ్ఛాకృతిమ్,
నృత్యద్భక్తమయూరమద్రినిలయం చంచజ్జటామండలం
శంభో వాంఛతి నీలకంధర సదా త్వాం మే మనశ్చాతకః. 52

టీక:— హే శంభో! హే నీలకంధర = శివా! (మేఘుఁడా) మే = నా యొక్క మనశ్చాతకః = మనస్సనెడు చాతకపక్షి, కారుణ్యామృతవర్షిణం = దయ యను అమృతమును వర్షించునట్టియు (దయచేత నీటిని వర్షించునట్టియు) ఘనవిపత్ = గొప్పఆపదయను, గ్రీష్మ = అతితాపమును (గ్రీష్మమును) ఛిదా = ఛేదించుటకు, కర్మఠం = సమర్థమైనట్టియు, విద్యాసస్య = విద్యయను పైరుయొక్క, ఫలోదయాయ = ఫలముగలుగుటకొఱకు (బ్రహ్మానందానుభవముకొఱకు) సుమనస్సంసేవ్యం = దేవతలచేతను, పండితులచేతను (కర్షకులచేతను) ఆశ్రయింపఁదగినట్టియు, ఇచ్ఛాకృతిం = కోరికరూపమైనట్టియు, నృత్యత్ = నాట్యముచేయుచున్న, భక్త = భక్తులనెడు (మేఘమందు ప్రీతిగల) మయూరం = నెమిళ్ళుగలిగినట్టియు, అద్రినిలయం = పర్వతము నివాసముగాఁగలట్టియు; చంచత్ = చలించుచున్న జటా = జడలయొక్క (మెఱుపులయొక్క) మండలం = సమూహముగలట్టియు, త్వాం = నిన్ను, సదా = ఎల్లపుడు, వాంఛతి = కోరుచున్నది.

తా:-నామనస్సను చాతకము నీలమేఘంబునఁబోలె వాంఛితసిద్ధికై నిన్ను వర్షింపవేఁచియున్నది. మేఘము జలము వర్షించును. నీవు దయామృతము కురిపింతువు. అది గ్రీష్మతాప మడంచును. నీవు సంతాపము లడంతువు. అది సస్యములను పండించును. నీవు విద్యాసస్యమును పండించి బ్రహ్మానందానుభవము ఫలముగా నిత్తువు. దేవతలు పండితులు నిన్ను భజింతురు. కర్షకులు మేఘుని భజింతురు. మయూరములు నల్లనిమేఘమునుచూచి నాట్యముచేయును. భక్తులు నిన్నుచూచి నాట్యము చేయుదురు. నీవు కైలాసపర్వతమున నుందువు. మేఘుఁడును పర్వతమున నుండును. కామరూపంబును జటావల్లియు నిరువురకును గలదు.

మ. వరదల్ గట్టు కృపాసుధాఝరము, లాపద్గ్రీష్మముల్ మాప, మీ
సరముల్ భక్తశిఖుల్ నటింప, సుమనస్సంసేవ్యతన్ గామ రూ
పరమై, దీప్రజటాప్తి, శైలవసతిన్ భాసిల్లు నో నీలకం
ధర! ధీచాతకమర్థి వేఁడు నిను విద్యా సస్యముం బెంపఁగన్. 52

అవ:-మహాదేవుని నెమలిగా భావించి స్తోత్రము చేయుచున్నారు.

శ్లో. ఆకాశేన శిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీ నతా
నుగ్రాహిప్రణవోపదేశనినదైః కేకీతి యో గీయతే,
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతం ముదా
వేదాంతోపవనే విహారరసికం తం నీలకంఠం భజే.

టీక:-యః = ఏశివుఁడు (నెమిలి) ఆకాశేన = ఆకాశముచేత, శిఖీ = శిఖావంతుఁ డనగా వ్యోమకేశుఁ డనుట (శిఖండకముగల నెమలి) సమస్తఫణినాం = సకలసర్పములకును, నేత్రా = నాయకుఁడైన వాసుకిచేత, కలాపీ = భూషణవంతుఁడు (పింఛముగల నెమలి) నత = నమ్రములైనవారిని, అనుగ్రాహి = అనుగ్రహించు స్వభావముగల, ప్రణవ = ప్రణవమంత్రముయొక్క, ఉపదేశ = ఉపదేశమందలి, నినదైః = ధ్వనులచేత, కేకీతిచ = కేకాధ్వనిగలవాఁడనియు (కేకాధ్వనిగల నెమలి) గీయతే = గానము చేయబడుచున్నాఁడో, శ్యామాం = నీలవర్ణమైనట్టియు, ఘనరుచిం = మేఘకాంతివంటి కాంతిగల, శైలసముద్భవాం = పార్వతిని (పర్వతమందు బయలుదేరిన మేఘకాంతిని) దృష్ట్వా = చూచి, నటంతం = నాట్యముసేయునట్టియు, వేదాంతోపవనే = వేదాంతమను ఉద్యానవనమందు, విహారరసికం = సంచరించుట

యందు రసికుఁడైనట్టియు, తం = ఆ, నీలకంఠం = ఈశ్వరుఁడను నెమలిని, ముదా = సంతోషముతో, భజే = సేవించుచున్నాను.

తా:—దేవా ! నీలకంఠశబ్దము ఉభయార్థకము. వ్యోమకేశుండును, నాగ యజ్ఞోపవీతుండును ప్రణవోపదేశముచేత భక్తుల ననుగ్రహించువాఁడును పార్వతీ వల్లభుండును వేదాంతవేద్యుండునునగు నీలకంఠుని భజించెదను.

చ. నతజనరక్షణాయిత కనత్ప్రణవ ప్రతిబోధనిస్వ నో
న్నతి మెయిఁ గేగి వ్యోమకలనక్ శిఖి, వాసుకిచేఁ గలాపినా
నుతిగని శైలజాసిత మనోజ్ఞ ఘనచ్ఛవిఁ గాంచి యాడుచుక్
శ్రుతిశిఖలక్ మహావనులఁ గ్రుమ్మరు నీలగళేశుఁ గొల్చెదన్. 53

అవ:— పార్వతీపరమేశ్వరులను మయూరీమయూరములుగా నిరూపించి ప్రార్థించుచున్నారు.

శ్లో. సంధ్యాఘర్మదినాత్యయో హరికరాఘాతప్రభూతానక
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటాచంచలా,
భక్తానాం పరితోషబాష్పవితతిర్వృష్టిర్మయూరీ శివా
యస్మిన్నుజ్జ్వలతాండవం విజయతే తం నీలకంఠం భజే.

టీక:—సంధ్యా = సాయంకాలము, ఘర్మదినాత్యయః = వర్షారంభకాలము గను, హరి = విష్ణువుయొక్క, కర = చేతులచేతనైన, ఆఘాత = దెబ్బచేత, ప్రభూత = పుట్టిన, ఆనక = మద్దెలయొక్క, ధ్వానః = ధ్వని, వారిదగర్జితం = ఉఱుముగను, దివిషదాం = దేవతలయొక్క, దృష్టిచ్ఛటా = చూపులపరంపర, చంచలా = మెఱపుగను, భక్తానాం = భక్తులయొక్క, పరితోషబాష్పవితతిః = ఆనందాశ్రుధార, వృష్టిః = వర్షముగను, శివా = పార్వతి, మయూరీ = ఆడనెమలిగను, యస్మిన్ = ఏ నీలకంఠుఁడను నెమిలియందు, ఉజ్జ్వలతాండవం = ప్రకాశమానమగు తాండవ నృత్యము, విజయతే = సర్వోత్కృష్టముగా నున్నదో, తంనీలకంఠం = ఆశివుని, భజే = భజించుచున్నాను.

తా:—ప్రదోషకాలమను వర్షాకాలమున శ్రీహరి వాయించు మద్దెలచప్పుడు ఉఱుముగాను, ఆకాశమందుండిచూచు దేవతలచూపులు మెఱుపులుగాను, భక్తుల సంతోషపరివాహము ధారావర్షముగాను, ప్రకాశింప తాము మయూరీమయూర ములుగా తాండవనృత్యక్రీడాసక్తులైన పార్వతీపరమేశ్వరులను భజింతును.

చ. పరఁగెడు సంధ్యవర్ష, సురవర్గపుఁ జూడ్కులు క్రొమ్మెఱుంగులా,
హరికర ఘాతజాత మురజారవ మూర్జితగర్జ, భక్త బం
ధుర పరితోష బాష్పతతి తుంపురు లార్యమయూరిగా మనో
హరముగఁ దాండవించు మహితాత్ముని నీలగళున్ భజించెదన్. 54

అవః—శుద్ధస్వరూపుఁడగు శంభుని నమస్కరించుచున్నాను.

శ్లో. ఆద్యాయామితతేజసే శ్రుతిపదై ర్వేద్యాయ సాధ్యాయ తే
విద్యానందమయాత్మనే త్రిజగతస్సంరక్షణోద్యోగినే,
ధ్యేయాయాఖిలయోగిభిస్సురగణై ర్గేయాయ మాయావినే
సమ్యక్తాండవసంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే.

టీకః—ఆద్యాయ = ప్రపంచమునకు మొదటివాఁడును, అమితతేజసే = గొప్ప తేజస్సుగలవాఁడును, శ్రుతిపదైః = వేదవాక్యములచేత, వేద్యాయ = తెలియఁదగిన వాఁడును, సాధ్యాయ = ప్రీతిమాదిరూపమున ప్రతిష్ఠింపబడినవాఁడును, విద్యానంద మయాత్మనే = చిదానందమయుఁడైన ఆత్మస్వరూపుఁడును, త్రిజగతః = ముల్లోకముల యొక్క, సంరక్షణ = కాపాడుటయందు, ఉద్యోగినే = ప్రవృత్తిగలవాఁడును, అఖిలయోగిభిః = యోగు లందఱిచేతను, ధ్యేయాయ = ధ్యానింపఁదగినవాఁడును, సురగణైః = దేవతాసమూహముచేతను, గేయాయ = గానముచేయఁదగినవాఁడును, మాయావినే = చిచ్ఛక్తితోఁ గూడినవాఁడును, సమ్యక్తాండవసంభ్రమాయ = చక్కని తాండవనృత్యమందు తొందరగలవాఁడును, జటినే = జడలుదాల్చినవాఁడును, శంభవే = సుఖకరుండును, అగు, తే=నీకొఱకు, సా, ఇయంనతిః=ఆయీనమస్కార మగుఁగాక.

తాః—ఎవరెవరి నుద్దేశించి చేసిన నమస్కారమైనను సర్వజగత్కారణుం డును, సర్వాంతర్యామియునగు శుద్ధస్వరూపుఁడైన యాపరమశివునకే చెందుఁగాక !

మ. విలసత్తేజుఁడు, వేదవేద్యుఁడు, మహావిద్యాధ్యుఁడానందని
ష్ఠులుఁడాద్యుండు, త్రిలోకరక్షి, జటి, చిద్వ్యక్తుండు, బృందారకా
వళి గేయుండు, మునీంద్రగమ్యుఁడు, స్వయంప్రారబ్ధ నృత్యక్రియా
కలనోల్లాసుఁడునైన శంభునకివే కైమోడ్పు సందోహముల్. 55

అవః—సకల ప్రపంచస్వరూపుఁడగు పరమశివునిఁ గొనియాడుచున్నారు.

శ్లో. నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీశ్రేయసే
సత్యాయాదికుటుంబినే మునిమనఃప్రత్యక్షచిన్మూర్తయే,
మాయాసృష్టజగత్త్రయాయ సకలామ్నాయాంతసంచారిణే
సాయం తాండవసంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే.

టీక:—నిత్యాయ = నిత్యుఁడును, త్రిగుణాత్మనే = సత్త్వరజస్తమోగుణములు శరీరములుగాగలవాఁడును, పురజితే = త్రిపురాసురులను జయించినవాఁడును, కాత్యాయనీశ్రేయసే = పార్వతీదేవియొక్క తపఃఫలమైనవాఁడును, సత్యాయ = మూఁడు కాలములయందును బాధలేనివాఁడును, ఆదికుటుంబినే = మొట్టమొదటిసంసారియు, మునిమనః = మునుల మనస్సులకు, ప్రత్యక్ష = గోచరమైన, చిన్మూర్తయే = చిత్స్వరూపముగలవాఁడును, మాయా = మాయాశక్తిచేత, సృష్ట = సృజింపఁబడిన, జగత్త్రయాయ = ముల్లోకములుగలవాఁడును, సకల ఆమ్నాయాంత = సమస్తమైన ఉపనిషత్తులయందును, సంచారిణే = విహరించువాఁడును, సాయం = సాయంకాలమున, తాండవసంభ్రమాయ = తాండవము సేయు తొందరగలవాఁడును, జటినే = జడలు ధరించినవాఁడును, శంభో = అగుశివునికొఱకు, సాఽయంనతిః = ఈయీ నమస్కారమగుఁగాక !

తా:—నిత్యుఁడును, పురభేదియు, పార్వతీమనోహరుఁడును, మునిమనస్సులకు గోచరించువాఁడును, చిద్రూపుఁడును, వేదాంతవేద్యుఁడును, మాయవలన ముల్లోకములను గల్పించువాఁడును, తాండవనృత్యమందాసక్తిగలవాఁడు నగు శివునకు నమస్కారము.

మ. పురనిర్భేదివి, ప్రాక్కుటుంబివి, యుమాపుణ్యాంబ, వత్తాపసో
త్కరహృద్గోచర చిన్మయాకృతివి, ప్రోద్యద్వేదశీర్షైక సం
చరణస్ఫూర్తివి, శాంబరీకృత జగజ్జాలుండ, వాద్యా, జటీ
శ్వర! సంధ్యానటనప్రియా! యిదె నమస్కారంబు నీకీశ్వరా! 56

అవ:—సేవించుటయందు నేర్పులేనివాఁడనైనను నన్నుతప్పక సంరక్షింపవలయునని సహేతుకముగాఁ జెప్పుకొనుచున్నారు.

శ్లో. నిత్యం స్వోదరపోషణాయ సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవత స్సేవాం న జానే విభో,

మజ్జన్మాంతరపుణ్యపాకబలతస్త్వం శర్వ సర్వాంతర
స్తిష్ఠస్యేవహి తేనవాపశుపతే తేరక్షణీయోఽస్మ్యహమ్.

టీక:—నిత్యం = అనుదినము, స్వోదరపోషణాయ = తనపొట్ట పోసికొనుటకు, విత్తాశయా = ధనముం దాశతో, సర్వాన్ = అందఱను, ఉద్దిశ్య = ఉద్దేశించి, వ్యర్థం = వృథాగా, పర్యటనం = సంచారమును, కరోమి = చేయుచున్నాను, హేవిభో ! భవతః = నీయొక్క, సేవాం = సేవను, నజానే = ఎఱుగను, హేపశుపతే = సర్వప్రపంచపాలకుండవును, హేశర్వ = పాపధ్వంసకుండవునగు శంకరా ! మత్ జన్మాంతరపుణ్య = నాపూర్వపుణ్యముయొక్క, పాకబలతః = పరిపాకవశమున, త్వం = నీవు, సర్వాంతరః=అంతర్యామివిగా నామనస్సున, తిష్ఠస్యేవహి=ఉన్నావు కదా ! తేనవా = అందుచేతనైనను, తే = నీకు, అహం = నేను, రక్షణీయం = రక్షింపతగినవాడును, అస్మి = అగుదును.

తా:—దేవా ! పొట్టపోసికొనుటకు ధనాశతో నెందఱనో యాశ్రయించితిని గాని నిన్ను సేవించు టెఱుంగను. పూర్వజన్మమున నేకొంచెమో పుణ్యము చేసితిని కనుక నే నాయంతరంగమున నున్నాడవు. నన్ను రక్షించుభారము నీపైనున్నది.

చ. నిరతముఁ బొట్టకూటికయి నేను ధనాశవృథాగ నెల్లరన్
దరిసితి నిన్భజింపనొక నాడును శర్వ! క్షమింపు, మద్భవాం
తరచిరపుణ్యపాక కలనన్ సకలాంతర వర్తివంచు ని
న్నెఱిఁగితిఁగాన నీకునిక నెట్లును రక్ష్యుఁడనైతిఁగాపుమీ! 57

అవ:—అజ్ఞానమను తెరఁ దొలఁగించి సాక్షాత్కరింపుమని పరమేశ్వరుని వేఁడుకొనుచున్నారు.

శ్లో. ఏకో వారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమోమండలం
భిత్వా లోచనగోచరోఽపి భవతి త్వం కోటిసూర్యప్రభః,
వేద్యః కిం నభవస్యహో ఘనతరం కీదృగ్భవేన్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయ మే పశుపతే సాక్షాత్ప్రసన్నో భవ.

టీక:—హే పశుపతే ! వారిజబాంధవః = సూర్యుఁడు, ఏకః=ఒక్కడయ్యును, క్షితినభోవ్యాప్తం = భూమ్యాకాశములు నిండిన, తమోమండలం = అంధకారరాశిని, భిత్వా = భేదించి, లోచనగోచరోఽపి = కన్నుల కగపడుచున్నవాఁడును, భవతి =

అగుచున్నాడు, త్వం = నీవు, కోటిసూర్యప్రభః = కోట్లకొలది సూర్యులకాంతిగల వాడవు, వేద్యః = తెలిసికొనతగినవాడవు, కింనభవసి = ఏలకావు ? అహో = ఆశ్చర్యము, ఘనతరం = మిగులదట్టమైనదయ్యును, మత్ తమః = నా అజ్ఞానాంధకారము, కీదృక్ = ఏపాటిది, భవేత్ = అగును ? తత్ = కనుక, సర్వం = ఆ యజ్ఞానము నంతయు, వ్యపనీయ = తొలగించి, సాక్షాత్ = ప్రత్యక్షమై, ప్రసన్నః = అనుగ్రహించువాడవు, భవ = అగుమా !

తా:—దేవా ! ఒక్క సూర్యుడే భూమ్యాకాశముల నిండిన చీకటిని పోగొట్టుచు కన్నుల కగపడుచున్నాడు. కోటిసూర్యుల వెలుగొందుచున్న నీవేల ప్రత్యక్షము గావు ? నా యజ్ఞానాంధకారము తొలగించుట నీకొక లెక్కయా ? నాకు సాక్షాత్కరించి యనుగ్రహింపుము.

చ. భువి దివిసంటిపెద్ద తమముం దెగఁ జీల్చుచు గోచరించుఁ జ
క్షువులకుఁ గూడనాతఁడొక సూర్యుఁడె; నీవనఁగోటి సూర్య దీ
ప్తివి తెలియంగ రావిదియు వింతమ రెంతటిదైన మత్తమ
మ్మవలకు నెట్టి నాకిక స్వయమ్ముగఁ గన్పడి కావుమీశ్వరా! 58

అవ:—అయ్యో తెఱగున నీపాదారవిందభజనముచేయ నాచిత్తము కోరుచున్న దని యనుచున్నారు.

శ్లో. హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా,
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్.

టీక:—హే పశుపతే ! హే విభో ! హే గౌరీనాథ ! హంసః = హంస, పద్మవనం = కమలములగుంపును, చాతకః = చాతకపక్షి, నీలాంబుదం = నల్లనిమేఘమును, కోకః = చక్రవాకపక్షి, కోకనదప్రియం = సూర్యుని, చకోరః = చకోరపక్షి, ప్రతిదినం = దినదినమును, చంద్రం = చంద్రుని, యథా = ఏప్రకారముగా, సమిచ్ఛతి = కోరుచున్నదో, తథా = ఆప్రకారముగా, మామకం = నాసంబంధమైన, చేతః = మనస్సు, చిన్మార్గమృగ్యం = ఉపనిషత్తులయందు వెదుకదగిన, కైవల్యసౌఖ్య

ప్రదం = కైవల్యసౌఖ్యము నొసగునట్టి, భవత్పదాబ్జయుగళం = మీపాదపద్మ ద్వంద్వమును, వాంఛతి = కోరుచున్నది.

తా:—ఈశ్వరా! హంసపద్మములను, వానకోయిల వర్షాకాలమేఘమును, చక్రవాకము సూర్యుని, వెన్నెలపులుగు చంద్రునికోరినట్లు నీపాదపద్మములను నా చిత్త మెల్లప్పుడు కోరుచున్నది.

మ. జలవాహంబును చాతకంబుఁబలె, భాస్వత్పద్మముల్ హంసయుం
బలె, నాదిత్యునిఁ గోకమట్టులు, సుధాభానుండ కోరంబటుల్
వలచుల్ నిత్యముఁ గాదు చిత్తము, చిదధ్వప్రాప్తమై మోక్షమి
మ్ములఁ జేకూర్చు భవత్పదాబ్జ యుగమో భూతేశ్వరా!యీశ్వరా!

అవ:—ఈశ్వరపాదసేవ చేయుమని తన మనస్సును నియమించుచున్నారు.

శ్లో. రోధస్తోయహృతశ్శ్రమేణ పథికశ్ఛాయాం తరోర్వృష్టితో
భీతస్స్వస్థగృహం గృహస్థమతిథిర్దీనః ప్రభుం ధార్మికమ్,
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృత స్త్వం తథా
చేతస్సర్వభయాపహం వ్రజసుఖంశంభోః పదాంభోరుహమ్.

టీక:—హే చేతః = ఓ మనసా! తోయహృతః = ప్రవాహవేగమున కొట్టు కొనిపోవువాఁడు, రోధః = ఒడ్డును, పథికః = బాటసారి, శ్రమేణ = అలసటచేత, తరోః = చెట్టుయొక్క, ఛాయాం = నీడను, వృష్టితః = వర్షమువలన, భీతః = భయ పడినవాఁడు, స్వస్థగృహం = సుఖమైనయింటిని, అతిథిః = అతిథి, గృహస్థం = సంసా రిని, దీనః = దరిద్రుఁడు, ధార్మికంప్రభుం = ధర్మాత్ముడైనరాజును, సంతమసా కులః = చీకటిలో కొట్టుకొనుచున్నవాడు, దీపం = దీపమును, శీతావృతః = చలిచే చుట్టబడినవాడు, శిఖినంచ = అగ్నిహోత్రమును, యథా = ఎట్లాశ్రయించునో, తథా = అట్లే, త్వం = నీవు, సర్వభయాపహం = అన్నిభయములను పోగొట్టునదియు, సుఖం = సుఖకరమైనదియు అగు, శంభోః = శివునియొక్క, పదాంభోరుహం = పాద పద్మమును, వ్రజ = ఆశ్రయింపుము.

తా:—ప్రవాహమునఁ గొట్టుకొనిపోవువాఁడు ఒడ్డును, బాటసారి చెట్టునీడను, వర్షమున తడియువాడు మంచియింటిని, దీనుఁడు ధర్మాత్ముని, చీకటిలోపడ్డవాడు

వేపమును, చలిచే పీడితుడు అగ్నినిఁవలె ఓ మనసా నీ వీశ్వరునిపాదము లాశ్రయిం పుము. అది సమస్తభయములను పోగొట్టును.

చ. వరదను బోవువాఁడు దరి, వాడినపాంథుఁడు నీడ, వానవం
దిరెడు జనుండు గట్టియిలు, దీనుఁడు ధార్మికభూపుఁ జీకటిఁ
దురపిలువాఁడు దివ్వెఁ జలిఁదూలెడు వాఁడనలమ్మునుంబలెఁ
దరిసి భజింపు మానసమ! త్రాసముడుల్చుహరాంఘ్రిపద్మమున్.

అవ:—భక్తిస్వరూపమును నిర్ణయించుచున్నారు.

శ్లో. అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే.

టీక:—ఇహ=ఈలోకమందు, నిజబీజసంతతిః = తనగింజలరాశి, అంకోలం= ఊడుగచెట్టును, సూచికా = సూది, అయస్కాంతోపలం = సూదంటురాయిని, సాధ్వీ=పతివ్రత, నైజవిభుం=తనభర్తను, లతా = తీగ, క్షితిరుహం = వృక్షమును, సింధుః=నది, సరిద్వల్లభం=సముద్రమును, యథా = ఏప్రకారముగా, ప్రాప్నోతి= పొందుచున్నదో, తథా=ఆప్రకారముగా, చేతోవృత్తిః=చిత్తవృత్తి, పశుపతేః= ఈశ్వరునియొక్క, పాదారవిందద్వయం = పాదపద్మములజంటను, సదా = ఎల్లప్పు డును, ఉపేత్య = పొంది, తిష్ఠతి=ఉండుట ఏదికలదో, సా = అది, భక్తిరితి = భక్తి యని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా:—ఊడుగగింజలు చెట్టును వానియంతటనవియే యంటుకొనునట్లు, సూదిని సూదంటురాయిదగ్గరకు పరుగెత్తునట్లు పతివ్రత పతిసేవచేయునట్లు, తీగ చెట్టును పెనవేసికొనునట్లు నదులు సముద్రమును పొందునట్లు మనోవృత్తి శివుని పాదపద్మము లందుచొచ్చియుండుటయే భక్తియని పెద్దలు చెప్పుదురు.

ఉ. తీవియ పాదపమ్మును, బతివ్రత స్వీయ హృదీశు, నైజబీ
జావళి యూడుగుంగుజము నాపగ యబ్ధిని, సూది నయ్యయో
గ్రావమునట్లు శంభుపద కంజమునొందిన చిత్తవృత్తి పెం
పావహిల్లంగ భక్తి సము పాఖ్యనుమించి ఘటించు శ్రేయమున్. 61

అవ:—తల్లి బిడ్డను పోషించునట్లు భక్తి భక్తుని గాపాడునని చెప్పుచున్నారు.

శ్లో. ఆనందాశ్రుభిరాతనోతి పులకం నైర్మల్యతశ్ఛాదనం
వాచాశంఖముఖస్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః,
రుద్రాక్షైర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యంకే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి.

టీక:—హే దేవ ! భక్తిజననీ=నీభక్తియనెడుతల్లి, ఆనందాశ్రుభిః=ఆనంద బాష్పములచేత, పులకం=రోమాంచమును, ఆతనోతి=విస్తరింపచేయును, నైర్మల్యతః=నిర్మలత్వముచేత, ఛాదనం = బట్టకట్టుటయు నొనర్చును, వాచాశంఖముఖస్థితైః = వేదవాక్యను శంఖముయొక్క ముఖమందున్నట్టి, చరిత్రఅమృతైః = నీచరిత్రము లనెడు పాలతో, జఠరాపూర్తిం = కడుపునిండఁజేయును, రుద్రాక్షైః = రుద్రాక్షలచేతను, భసితేన=విభూతిచేతను, వపుషః = శరీరముయొక్క, రక్షాం = సంరక్షణముచేయును, భవత్‌భావనాపర్యంకే=నీతలంపనెడు మంచమందు, వినివేశ్య = పరుండబెట్టి, భక్తార్భకం = భక్తుడను శిశువును, రక్షతి=కాపాడును.

తా:—తల్లి బిడ్డను చేరదీసి పులకితుని చేయునట్లు భక్తిరసము భక్తుని పరవశుని చేయును. తల్లి బిడ్డ కీగలు మొదలగుబాధను తొలగించుటకు బట్టకప్పునట్లు భక్తి నిర్మలభావము నావరింపచేయును. తల్లి పాలను గుడుపునట్లు భక్తివేదాదివాక్యముగా నీచరితామృతమును తనివితీరత్రాగించును. రుద్రాక్షములు ధరింపజేసి విభూతిపెట్టించి రక్షించును. తల్లి బిడ్డను మంచముపై పరుండబెట్టి కాపాడునట్లు భక్తి మనస్సునం దీశ్వరధారణయను మంచమున ప్రవేశపెట్టి పరిపాలించును.

మ. పరితోషాశ్రులచే గగుర్పొడుపు; నాపాదించుఁ దేర్పాటుచేఁ
దెర; క్రోవించు భవత్కథామృతము నెంతే వేదశంఖమ్ముచే;
పరపుఁ రక్షభవాక్షభూతుల; నిడుం ద్వద్ధ్యానపుందొట్లఁ; ని
వ్వరుసన్ బెంచును భక్తిమాతనిరతిఁ భక్తార్భకుఁ శంకరా! 62

అవ:—శివభక్తియొక్క వైచిత్ర్యమును వర్ణించుచున్నారు.

శ్లో. మార్గావర్తితపాదుకా పశుపతేరంగస్య కూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే,

కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే!

టీక:-పశుపతేః=శివునియొక్క, అంగస్య = అవయవమునకు, మార్గావర్తిత పాదుకా=పలుమారుదారినడచిన పాత్రితచెప్పు, కూర్చాయతే = కనుబొమలనడుమైనది, పురరిపోః = శివునకు, గండూషాంబునిషేచనం = పుక్కిలించిననీరు చల్లుట, దివ్యాభిషేకాయతే=దివ్యమైన అభిషేకమైనది, కించిద్భక్షితమాంసశేషకబళం = కొంచెముతినగా మిగిలిన మాంసపుముక్క, నవ్యోపహారాయతే=క్రొత్తనివేదనద్రవ్యమగుచున్నది, వనచరః=కిరాతుడు, భక్తావతంసాయతే=భక్తశ్రేష్ఠుడగుచున్నాడు, భక్తిః=భక్తి, కింనకరోతి = ఏమిచేయదు ? అహో = ఎంతచిత్రము !

తా. తిన్నడనుభక్తుని పాత్రి గిలిపోయిన కాలిచెప్పు శివునకు (శ్రీకాళహస్తీశ్వరునకు) కన్బొమల నడిమిచోటుగా చేర్పవయ్యెను. పుక్కిటపట్టిననీ రభిషేక జలమయ్యెను. ఎంగిలిమాంసపుముక్కలు నివేదనకైనవి. కిరాతుడగు తిన్నడు భక్తాగ్రగణ్యుడయ్యెను. భక్తిమహిమ యెన్నరానిది.

చ. పెలుచను పుక్కిలింత తడుపే జలకమ్మగుఁ బ్రాఁతచెప్పు ని
గ్గులొలుకునట్టి కూర్చ్చయగుఁ గొంచెపు టెంగిలి మాంసఖండ ము
జ్జ్వలమగు విందగుఁగా గహనచారియు భక్తవతంసుఁ డేయగుఁగా
భళిరె! శివార్చనావిధిని భక్తియె యున్న నిఁకేమికావలెఁగా. 63

అవ:-దేవా! నాచిత్తపాదుకలు తొడిగికొని విహరింపుమని వేడుకొనుచున్నారు.

శ్లో. వక్షస్తాడనమంతకస్య కఠినాపస్మారసమ్మర్దనం
భూభృత్పర్యటనం నమత్సురశిరః కోటీరసంఘర్షణమ్,
కర్మేదం మృదులస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే
మచ్చేతోమణిపాదుకావిహరణం శంభో సదాంగీకురు.

టీక:-గౌరీపతే! శంభో! అంతకస్య = యమునియొక్క, వక్షస్తాడనం = రొమ్మునతన్నుటయు, కఠిన=కఠినమైన, అపస్మార = స్వరూపాజ్ఞానముయొక్క, సమ్మర్దనం=నిగ్రహించుటయు, భూభృత్పర్యటనం = కొండయందు సంచరించుటయు, నమత్ =నమస్కరించుచున్న, సుర = దేవతలయొక్క, శిరః = శిర

స్సులయందలి, కోటీర = కిరీటములయందు, సంఘర్షణం = ఒరయుటయు, ఇదం = ఈనాలుగును, మృదులస్య = మార్దవయుక్తమైన, తావకపదద్వంద్వస్య = నీపాద ద్వయముయొక్క, కర్మ = వ్యాపారము, మచ్చేతోమణిపాదుకావిహరణం = నాచిత్త మనెడు మణిమయమైన పాదుకలతో సంచారమును, సదా = ఎల్లప్పుడు, అంగీకురు = అంగీకరింపుము.

తా. శంకరా ! యమునిఱొమ్ము తన్నవలెను. అపస్మార మణఁగ ద్రొక్క వలెను. కొండమీద తిరుగవలెను. నమస్కరింపవచ్చిన దేవతాదుల కిరీటములరాపిడి కోర్వవలెను. ఇదంతయు కఠినకృత్యము. నీపాదము లతికోమలములు. నామనస్సను మణిపాదుకలను తొడిగికొనుటకు దయచేసి యంగీకరింపుము.

ఉ. ఘోర యమేంద్రు వక్షమును గూలఁగఁదన్నుట, దుర్దమవ్యప
స్మార విమర్దనంబుఁగను మన్నడయాట, నమత్సురౌఘకో
టీరపురాపు, నివ్విధులు డెప్పరముల్గద నీ నవాంఘ్రి కం
బారమణా! గ్రహింపుమిదె మామకమానస రత్నపాదుకన్. 64

అవ:—పరమశివుని పాదారవిందములు సేవించువారికి దుర్లభమేమియు లేదని రూఢిగాఁ జెప్పుచున్నారు.

శ్లో. వక్షస్తాడనశంకయా విచలితో వైవస్వతో నిర్జరాః
కోటీరోజ్జ్వలరత్నదీపకలికానీరాజనం కుర్వతే,
దృష్ట్వా ముక్తివధూస్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే
యచ్చేత స్తవ పాదపద్మభజనం తస్యేహ కిం దుర్లభమ్.

టీక:—హేభవానీపతే ! యచ్చేతః = ఏపురుషులచిత్తము, తవ = నీయొక్క, పాదపద్మభజనం = పాదపద్మము సేవచేయునో, దృష్ట్వా = వానినిచూచి, వైవస్వతః = యముడు, వక్షస్తాడనశంకయా = ఱొమ్మునన్ననుభయముచేత, విచలితః = పాఱి పోవుచున్నాడు, నిర్జరాః = దేవతలు, కోటీర = కిరీటములయందు, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, రత్నదీప = దీపములవంటిరత్నములయొక్క, కలికా = అంకురములచేత, నీరాజనం = నీరాజనమును, కుర్వతే = చేయుచున్నారు, ముక్తివధూః = ముక్తికాంత, నిభృతాశ్లేషం = గాఢాలింగనమును, తనోతి = చేయుచున్నది, తస్య = ఆభక్తునికి, ఇహ = ఈలోకమందు, దుర్లభం = లభ్యముగానిది, కిం = ఏది ?

తా:—శంకరా ! చంద్రశేఖరా ! మీభక్తునిఁజూచి మునుపటివలె ఱొమ్మున తన్నుదువేమోయని భయపడి యముడు పాఱిపోవును. దేవతలు తమకిరీటమాణిక్య దీపములతో నీకు నీరాజనము లిత్తురు. ముక్తికాంత తనంతతావచ్చి యాలింగన మొసంగును. ఇంక నీభక్తున కేది దుర్లభము ?

చ. నిరతము నిన్భజించు జనునింగని నంతనె పార్వతీశ్వరా!
స్ఫురదురుమౌళి రత్నభరశోభల నెత్తెదరారతుల్ సురో
త్కరములు, గుండెవ్రీలఁబడఁ దన్ను నటంచుఁగృతాంతుఁడవ్వలం
దరలును, ముక్తికాంత నిభృతంబు నిగూహామునిచ్చుఁ బేరిమిన్.

అవ:—నన్ను రక్షింపుమని వేడుకొనుచున్నారు.

శ్లో. క్రీడార్థం సృజసి ప్రపంచమఖిలం క్రీడామృగాస్తే జనాః
యత్కర్మాచరితం మయా చ భవతః ప్రీత్యై భవత్యేవ తత్,
శంభో స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మాన్మామకరక్షణం పశుపతే కర్తవ్య మేవ త్వయా.

టీక:—శంభో ! అఖిలంప్రపంచం = సమస్తమైనలోకమును, క్రీడార్థం = లీలామాత్రఫలముగా, సృజసి = సృజించుచున్నావు, తే = నీకు, జనాః = ప్రజలు, క్రీడామృగాః = విలాసార్థమైనజంతువులు, మయా = నాచేత, యత్ = ఏ, కర్మ = కర్మము, ఆచరితం = ఆచరింపబడినదో, తత్ = ఆకర్మము, భవతః = నీయొక్క, ప్రీత్యై = ప్రేమకొఱకు, భవత్యేవ = అగుచున్నది, మచ్చేష్టితం = నావ్యాపారము, స్వస్య = నీసంబంధమైన, కుతూహలస్య = ఇష్టమునకు, కరణం = సాధకమైనది, నిశ్చితం = నిశ్చయము, తస్మాత్ = కాబట్టి, హే పశుపతే = ఓ పరమశివా ! మామకరక్షణం = నాసంరక్షణము, త్వయా = నీచేత, కర్తవ్యమేవ = చేయఁదగినది.

తా:—ఈశ్వరా ! నీవు ప్రపంచమంతయు సృజించుట విలాసార్థముగదా ! ఈ ప్రజలందఱు నీ వినోదార్థకమైన జంతువులు. వారివారి పెంపుడుజంతువుల నడవడులు వారికి ప్రేమాస్పదములేకదా ! కావున నేనుచేయు సత్కర్మములుగాని దుష్కర్మములుగాని నీకు తృప్తికరములగును. కనుక నన్ను రక్షింపవలసినవాడ వగుచున్నావు.

ఉ. కేళికిఁగూర్తివీజగముఁ గేళి మృగావళులీజనమ్ము, నే
హేల నొనర్చు కర్మముల నెల్లను నిన్నలరింపనేకదా!
మూలము నీముదమ్మునకు భూతప! నాచెయిదమ్మొకావునన్
బోలుఁగదయ్య! నీకు నన్ప్రబోధి యొనర్చుట వశ్యమున్ శివా! 66

అవ:—ఈశ్వరధ్యానము శరణుచేసికొనియెద ననుచున్నారు.

శ్లో. బహువిధపరితోషబాష్పపూర
స్ఫుటపులకాంకితచారుభోగభూమిమ్,
చిరపదఫలకాంక్షి సేవ్యమానాం
పరమసదాశివభావనాం ప్రపద్యే.

టీక:—బహువిధ = అనేకవిధములైన, పరితోషబాష్పపూర = ఆనందబాష్పములప్రవాహమునకు, స్ఫుట = వ్యక్తపడిన, పులకాంకిత = రోమాంచరూపమైన, భక్తిచిహ్న = భక్తియొక్క గుర్తునకు, చారు = రమ్యమైన, భోగభూమి = భోగస్థానమును, చిరపద = శాశ్వతికైలాసపదమనెడు, ఫల = ఫలమును, కాంక్షి = అపేక్షించువారిచే, సేవ్యమానాం = సేవింపబడునదియు, పరమసదాశివభావనాం = సర్వోత్కృష్టుండగు శివునిధ్యానమును, ప్రపద్యే = శరణుపొందుచున్నాను.

తా:—ఆనందబాష్పములు, గగుర్పాటు మొదలగు భక్తిభావముల కాలవాలమై నిరంతర మీశ్వరధ్యానము చేయుచుందును.

ఉ. మించి యనేకభంగులను మేకొను హర్షరసాశ్రుపూర్తియున్
ప్రాంచిత రోమవిక్రియయు నాఁబడు భాక్తిక చిహ్నముల్ విజృం
భించెడు తావనంగఁదగి మేటి ముముక్షుజనమ్ము లెల్ల సే
వించు సదా శివస్మరణమే శరణమ్మగుఁ గాక నాకికన్. 67

అవ:—తనకావుపాలు కాఁగలసిన ఆవును మేపుకొనలేనివాడు చాల పశువులు గలవానిని ఆశ్రయించినట్లు తనభక్తియనుగోవుయొక్క పుష్టికై పశుపతియగు పరమశివునిఁ బ్రార్థించుచున్నారు.

శ్లో. అమితముదమృతం ముహుర్దుహంతీం
విమలభవత్పదగోష్ఠమావసంతీం,
సదయ పశుపతే సుపుణ్యపాకాం
మమ పరిపాలయ భక్తిధేనుమేకామ్.

టీక:_సదయ = దయతోఁ గూడినవాడా! పశుపతే! అమితముదమృతం = అపరిమితానందమను పాలు, ముహుః = మాటిమాటికి, దుహంతీం = పితుకనిచ్చునదియు, విమల = స్వచ్ఛమగు, భవత్పద = నీపాదములనెడు, గోష్ఠం = పశువుల కొట్టమును, ఆవసంతీం = నివసించునదియు, సుపుణ్యపాకాం = మంచిపుణ్యములకు ఫలమైనదియు, నగు, మమ = నాయొక్క, భక్తిధేనుం = భక్తియనుగోవును, ఏకాం = ఒక్కదానిని, పరిపాలయ = కాపాడుము.

తా:_శంకరా! నీవపారదయగలవాడవు. నాపుణ్యవశమున నాకీ భక్తియను గోవు లభించినది. ఇది ఆనందరూపమైనపాలు పదేపదే యిచ్చును. నీపాదరూపమైన పశువులచావడిలోఁ గట్టికొననిచ్చి యీ యావు నొక్కటి కాచిపెట్టుము.

ఉ. నీవిమలాంఘ్రి యుగ్మతల నిస్తులగోష్ఠమునన్ వసించుచున్
పావన పూర్వపుణ్య పరిపాకమనందగు భక్తిగోవు నా
ర్యావర! కావుమయ్య! సదయాత్మఁడవై యదిచేపుచుండు దే
వా! విలసత్ప్రమోదరసభార మహామృతసారధారలన్. 68

అవ:_దేవా! నే ననేకదోషముల కాటపట్టైనను చంద్రునివలె నన్నునుం జేకొనుమని వేడుచున్నారు.

శ్లో. జడతా పశుతా కళంకితా
కుటిలచరత్వం చ నాస్తి మయి దేవ,
అస్తి యది రాజమౌళే
భవదాభరణస్య నాస్తి కిం పాత్రమ్.

టీక:_జడతా = మూఢత్వము, పశుతా = వివేకములేమి, కళంకితా = కళంకము గలిగియుండుట, కుటిలచరత్వం = కుటిలముగా సంచరించుటయు, మయి = నాయందు,

నాస్తి = లేదు, దేవ ! రాజమౌళే = చంద్రశేఖరా ! అస్తియది = ఉన్నయెడల, భవదాభరణస్య = నీయలంకారమునకు, పాత్రం = తగినవాఁడను, నాస్మికిం = కానా ?

తా:-దేవా ! నాకు జడత్వపశుత్వ, కళంకితాకుటిలసంచారములేదు. చంద్రునకవి యున్నవి. అట్టిచంద్రుని శిరస్సునఁ బెట్టుకొంటివి. అట్టిగుణములునుగల నన్నేల ధరింపవు ? నన్నును రక్షింపుము.

చ. జడతయునుం బశుత్వమును సారెకు వక్రచరత్వయోగముఁ
విడువని పెన్గళంకితయు వేమఱుఁజూచిన లేశమేని నా
కడఁగనరావు చంద్రధర ! కానఁగవచ్చెనయేని నీకు నే
తొడవగు దొడ్డసంపదకు ధూర్జటి ! పాత్రుఁడుఁగాక యుండునే?

అవ:-శివుఁ డెల్లప్పుడును నాహృదయమందేకలఁడు గాన పూజించుట సులభమని చెప్పుచున్నారు.

శ్లో. అరహసి రహసి స్వతంత్ర బుద్ధ్యా 
వరివసితుం సులభః ప్రసన్నమూర్తిః, 
అగణితఫలదాయకః ప్రభు ర్మే 
జగదధికో హృది రాజ శేఖరోఽస్తి. 

టీక:-ప్రసన్నమూర్తిః = సుముఖమైనమూర్తిగలవాఁడా ! అగణిత = ఎంచ శక్యముగాని, ఫల = ఫలమునకు, దాయకః = దాతయు, ప్రభుః = సర్వసమర్థుఁడును, జగదధికః = జగత్తుకన్న నెక్కువవాఁడును, అగు, రాజశేఖరః = చంద్రశేఖరుఁడు, మేహృది = నామనస్సునందు, అస్తి = కలఁడు, అరహసి=బహిరంగముననను, రహసి= ఏకాంతమందుననను, స్వతంత్రబుద్ధ్యా = స్వాధీనమను తలంపుతో, వరివసితుం = పరిచర్యచేయుటకు, సులభః = సులభమైనవాఁడు, భవతి = అగును.

తా:-సుముఖుఁడై సులభుఁడై యెల్లకోర్కెలునీర్చుచు సర్వసమర్థుఁడైన చంద్రశేఖరుఁడు నాహృదయమందే యున్నవాఁడుగనుక ఏకాంతముగను బహిరంగముగను కూడ స్వతంత్రముగా పూజింపవచ్చును.

చ. మఱువక లోన వెల్వలను మానుగనేను యథేష్టముం గడున్
విరివిగఁ బూజసేయుటకు వీలుగఁ దాను ప్రసన్నమూర్తియై
వరముల లెక్కకెక్కుడిడువాఁడయి యీశ్వరుఁడై జగత్త్రయీ
గురుడగు చంద్రమౌళి యిదిగో కలఁడాత్మను నాకుఁ గాపుగన్. 70

అవః—ఈశ్వరస్మరణములచేత పాపములు నిర్మూలమైపోయి విద్వద్వరిష్ఠుఁడు శివసారూప్యము పొందునని చెప్పుచున్నారు.

శ్లో. ఆరూఢభక్తిగుణకుంచితభావచాప
యుక్తైశ్శివస్మరణబాణగణైరమోఘైః,
నిర్జిత్య కిల్బిషరిపూన్ విజయీ సుధీంద్ర
స్సానందమావహతి సుస్థిర రాజలక్ష్మీమ్.

టీకః—సుధీంద్రః = విద్వన్వరిష్ఠుఁడు, ఆరూఢ = పొడుకొనిన, భక్తిగుణ = భక్తియనెడు అల్లెత్రాటిచే, కుంచిత = వంచబడిన, భావ = అంతఃకరణంబను, చాప = వింటియందు, యుక్తైః = కూర్చబడిన, అమోఘైః = వ్యర్థములుగాని, శివస్మరణబాణగణైః = ఈశ్వరధ్యానమను బాణసమూహముతో, కిల్బిషరిపూన్ = పాపములనెడు శత్రువులను, నిర్జిత్య = నిశ్శేషముగా జయించి, విజయీ = జయముగలవాడగుచు, సానందం = ఆనందముతో కూడునట్లుగా, సుస్థిరరాజలక్ష్మీమ్ = స్థిరులైన బ్రహ్మాదులకు రాజైన శివునియొక్క సారూప్యమను స్థిరమైన రాజలక్ష్మిని, ఆవహతి = పొందును.

తా:—బుద్ధిమంతుడు భక్తినల్లెత్రాడుగను, అంతఃకరణవృత్తి విల్లుగను అమర్చుకొని అందీశ్వరధ్యానమును బాణముగా నెక్కుపెట్టి పాపములను శత్రువులనెల్ల జయించి, రాజురాజలక్ష్మిని పొందునట్లు, పరమేశ్వరసారూప్యలక్ష్మిని పొందును.

చ. గురుతర భక్తిభారగుణకుంచితభావ ధనుస్సునన్ సుధీ
శ్వరుఁడు మహేశ్వరస్మరణ శశ్వదమోఘ శరాళిగూర్చి దు
ర్భరచిరకిల్బిషోగ్రరిపురాజి నడంచి సహర్షవృత్తి సు
స్థిరతరరాజలక్ష్మిని వశీకృతగాఁగొని యేలు నిచ్చలున్. 71

అవ:—శివభక్తులు ధన్యులని చెప్పుచున్నారు.

శ్లో. ధ్యానాంజనేన సమవేక్ష్య తమః ప్రదేశమ్
భిత్వా మహాబలిభి రీశ్వరనామమంత్రైః,
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యేపాదపద్మ మిహ తే శివ తే కృతార్థాః.

టీక:—శివ! ధ్యానాంజనేన = ధ్యానమను కాటుకచేత, సమవేక్ష్య = చక్కగా కనిపెట్టి, ఈశ్వరనామమంత్రైః = ఈశ్వరునినామమంత్రములనెడు, మహాబలిభిః = గొప్పపూజోపకరణములచేత, తమఃప్రదేశం = అజ్ఞానమను స్థలమును, భిత్వా = త్రివ్వి, యే = ఏభక్తులు, దివాశ్రితం=దేవతలచేత పొందబడిన, భుజగభూషణం = సర్పమాభరణముగాగల్గిన, తే = నీయొక్క, పాదపద్మం=పాదకమలమును, ఇహ = ఈజన్మమందు, ఉద్వహంతి = ఎత్తికొనుచున్నారో, తే = వారు, కృతార్థాం = ధన్యులు.

తా:—నిధులు వెదకువాడు కన్నులకంజనము పూసికొని కనిపెట్టి యానందించునట్లు భక్తుడు ధ్యానాంజనముతో మీపాదపద్మనిధిని గనుగొని మీనామమంత్రములతో మహాబలి యొసర్చి ఆవరణమైన అజ్ఞానము దొలగించి మిమ్ముగొల్చి కృతార్థుడగును.

ఉ. ధ్యాన మహాంజనమ్మునఁగొని దట్టపుఁజీకటికోనలోని లో
స్థాన మెఱుంగనేర్చి ప్రమథప్రభు నామజపంబుతోడఁ దీ
రైన మహాబలుల్ నెఱపి యాశ్రితదైవత మావృతాహియా
శ్రీనగజాధిపాంఘ్రి సరసీజముఁబట్టెడు వారెపో కృతుల్. 72

అవ:—శివపాదభజన మక్కఱయైన దనుచున్నారు.

శ్లో. భూదారతా ముదవహ ద్యదపేక్షయా శ్రీ
భూదారఏవ కి మత స్సుమతే లభస్వ,
కేదార మాకలితముక్తి మహౌషధీనాం
పాదారవిందభజనం పరమేశ్వరస్య.

టీక:—హేసుమతే=ఓసద్బుద్ధీ ! యదపేక్షయా = దేనియపేక్షచేత, శ్రీభూదారఏవ = లక్ష్మియు భూమియు భార్యలుగాగల మహావిష్ణువే, భూదారతాం = వరాహరూపమును, ఉదవహత్ = తాల్చెనో, కిం = ఇది సుప్రసిద్ధమేకదా ! అతః = కనుక, ఆకలితమూర్తిమహౌషధీనాం = అపేక్షితములైన చతుర్విధముక్తులనెడు గొప్ప మూలికలకు, కేదారం=పంటపొలమైన, పరమేశ్వరస్య=మహాదేవునియొక్క, పాదారవిందభజనం=పాదపద్మసేవను, లభస్వ = పొందుము.

తా:—ఓసుబుద్ధీ ! మహావిష్ణువుసయితము శివునిపాదసందర్శనమునకై వరాహరూపమెత్తి పలుశ్రమలకోర్చినాడు. నీవా శివపాదభజనచేయుము. పంటనేలయం దోషధులు ఫలించునట్లు దానివలన సమస్తముక్తులు లభించును.

మ. మును దేనిన్ మదిగోరి పేరిమిని శ్రీభూదారుఁడే పొందఁగాం
చెనో భూదారత నట్టిశంభుపదరాజీవమ్ము సేవింపు మొ
య్యన మోక్షౌషధు లెల్లవేళలను సమ్యగ్భంగిమైఁ బండ నే
ర్చిన కేదార ధరాతలమ్మది మనీషిశ్రేష్ఠ ! నిక్కమ్ముగన్. 73

అవ:—ఈశ్వరపాదధ్యానము సదా మనస్సునందుండుగాక యనుచున్నారు.

శ్లో. ఆశాపాశక్లేశదుర్వాసనాది
భేదోద్యుక్తై ర్దివ్యగంధైరమందైః,
ఆశాశాటీకస్య పాదారవిందం
చేతఃపేటీం వాసితాం మే తనోతు.

టీక:—ఆశాశాటీకస్య = దిగంబరుడైన యీశ్వరునియొక్క, పాదారవిందం = పాదపద్మము, మే = నాయొక్క, చేతః పేటీం = మనస్సనుపెట్టెను, ఆశాపాశ = పాశమువంటి ఆశయు, క్లేశ = పంచక్లేశములనెడు, దుర్వాసనాది = చెడ్డసంస్కారములను, భేద = భేదించుటయందు, ఉద్యుక్తైః = ప్రవృత్తములైన, అమందైః = కొలదిగాని, దివ్యగంధైః = దివ్యమైన పరిమళములచే, వాసితాం = సువాసనగలదానినిగా, తనోతు = చేయుఁగాక !

తా:—దిగంబరుడగు పరమేశ్వరునియొక్క పాదపద్మము నామనఃపేటికయందుగల ఆశాపాశములు, పంచక్లేశములు మొదలగు దుర్వాసనల నడంచి దివ్యమైన సువాసనలతో నింపుఁగాక !

ఉ. ఆసయుఁ గ్లేశపంచకము నాదిగలట్టి సమస్తపూర్వ దు
ర్వాసనలం దొలంచి ప్రచురప్రథితామలదివ్యగంధ వి
న్యాసముఁగొల్పి మామక మనంబను పేటినిఁ దద్దిగంబరో
ద్భాసుర పాదపంకజము దద్దయు వాసిలఁ జేయుఁ గావుతన్. 74

అవ:—దానినే మఱొకవిధముగాఁ జెప్పుచున్నారు.

శ్లో. కల్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యమ్,
చేత స్తురంగ మధిరుహ్య చర స్మరారే
నేత స్సమస్తజగతాం వృషభాధిరూఢ.

టీక:—వృషభాధిరూఢ = నందివాహన మెక్కువాఁడ! సమస్తజగతాం = ఎల్ల లోకములకును, నేతః = నాయకుఁడా! స్మరారే = కామవైరీ! కల్యాణినం = శుభలక్షణములు గలదియు, సరసచిత్రగతిం=సరసముగా చిత్రములైన నడకలుగలదియు, సవేగం = వేగముతోఁ గూడినదియు, సర్వేంగితజ్ఞం = అందఱి యింగితంబు లెఱింగినదియు, అనఘం = నిర్దుష్టమైనదియు, ధ్రువలక్షణాఢ్యం = స్థిరమైన చిహ్నములు గలదియునగు, చేతఃతురంగం = నామనస్సను గుఱ్ఱమును, ఆరుహ్య = ఎక్కి, చర = సంచరింపుము.

తా. ఓవృషభవాహనా! బాణవేగమునఁబోవుచు, చిత్రగతులు ఘటిల్లఁగ, కల్యాణియై, ధ్రువలక్షణములుగల్గి, పరేంగిత మెఱింగి ప్రవర్తించు నామనస్సను గుఱ్ఱము నెక్కి విన్నాణముగా స్వారిచేయుము.

ఉ. బాణసమాన వేగమునఁ బాఱుచుఁ జిత్రగతుల్ ఘటిల్లఁ గ
ల్యాణి యనంగఁ బొల్చి ధ్రువలక్షణముల్ పొలుపొందఁగాఁ బర
ప్రాణుల యింగితం బెఱిఁగి వర్తిలు నాహృదయాశ్వ మెక్కి వి
న్నాణముగాఁ జరింపు భువనత్రయరక్షక! యుక్షఘోటకా! 75

అవ:—జన్మసాఫల్యమును వేఱొకవిధముగాఁ జెప్పుచున్నారు.

శ్లో. భక్తిర్మహేశ పదపుష్కర మావసంతీ
కాదంబినీవ కురుతే పరితోషవర్షమ్,

సంపూరితో భవతి యస్య మన స్తటాక
స్తజ్జన్మసస్య మఖిలం సఫలం చ నాన్యత్.

టీక. భక్తిః = సేవ, మహేశపదపుష్కరం = ఈశ్వరపాదరూపమైన ఆకాశ మున, ఆవసంతీ = స్థిరముగా నున్నదై, కాదంబినీవ = మేఘమాలయునుబోలె, పరితోషవర్షం = ఆనందవృష్టిని, కురుతే = కలిగించుచున్నది, తేన = ఆవర్షముచేత, యస్య = ఎవనియొక్క మనస్తటాకః = మనస్సనుచెఱువు, సంపూరితః = నిండింప, బడినది, భవతి = అగునో, తజ్జన్మసస్యం = వానిజన్మమనుపైరు, అఖిలం = సమస్తము, సఫలం = ఫలవంతమైనదిఅగును, తదితరంచ = అదిగాక తక్కినదిమాత్రము, న = సఫలముకాదు.

తా. భక్తి మేఘమాలికవలె మహాదేవుని పాదపద్మంబను గగనంబునందు వ్యాపించినదియై యానందవర్షము కురియును. అట్టి యావర్షమున కేపురుషుని మానస సరోవరమంతయు నిండునో వానిజన్మంబను సస్యంబే సఫలమైనది యగునుగాని తక్కినదికాదు.

ఉ. త్ర్యంబక పాదపుష్కరమునంటి మెలంగెడు సాంద్రభక్తి కా
దంబిని యిచ్చునట్టి ప్రమదంబను వృష్టిమెయిన్ యదీయ చే
తంబను సత్సరోవరము దద్దయు నిండునొ వానిజన్మ స
స్యంబు సమస్తమున్ సఫలమైచను; నిష్ఫలముల్ తదన్యముల్.

అవ:– మఱిరెండుశ్లోకములలో పలుతెఱంగుల విచారపడుచున్న బుద్ధియొక్క విచారముఁ బాపుమని వేఁడుకొనుచున్నారు.

శ్లో. బుద్ధి స్థిరా భవితుమీశ్వరపాదపద్మ
సక్తా వధూ ర్విరహిణీవ సదా స్మరంతీ,
సద్భావనా స్మరణదర్శనకీర్తనాది
సమ్మోహితైవ శివమంత్రజపేన విం తే.

టీక:– హే ఈశ్వర ! విరహిణీ = భర్తృవియోగముఁబొందిన, వధూరివ = భార్యవలె, పాదపద్మసక్తా = మీపాదకమలములం దాసక్తికలది కనుకనే, సదా = ఎల్లప్పుడును, స్మరంతీ = తలచుచున్న, బుద్ధిః = అంతఃకరణవృత్తి, శివమంత్రి

జపేన = శివమంత్రజపముచేత, సంమోహిస్సైవ = మోహపడినదియే యగుచు, స్థిరా= స్థైర్యముగల్గినది, భవితుం = అగుటకు, సత్ భావనా = సత్యమైనధ్యానము, స్మరణ = స్మరణము, దర్శన = దర్శనము, కీర్తన = కీర్తనము, ఆది = మొదలగువానినిఁగూర్చి, వింతే = విచారపడుచున్నది.

తా:-దేవా! నాబుద్ధి భర్తృవియోగముపొందిన భార్యవలె నిరంతరము ధ్యానముచేయుచు శివమంత్రము జపించుచు మోహమునొందినదై మీపాదధ్యాన, స్మరణ, సందర్శన, కీర్తన, పూజనాదులనుగూర్చి విచారించుచున్నది. దీని నుద్ధరింపుము.

చ. విరహిణియైన వధూటివలె వేగుచు నీశ్వరపాదపంకరు
ట్స్మరతి నెసంగు నాదుమతి నిచ్చలు శ్రీశివమంత్రజప్తి వి
స్ఫురణ విమోహమై స్థిరతఁబొందుటకై సముదారచింతనా
స్మరణ సుదర్శనస్తుతులసంగతిగోరి తపింతు నీశ్వరా! 77

అవ:-ధ్యానము మొదలగు వ్యాపారములందు ఏమిచేయుదునని సంశయపడుచున్న యీనాబుద్ధికి శ్రేష్ఠగుణము లుపదేశించి విచారముఁ దొలగింపుమని వేడుకొనుచున్నారు.

శ్లో. సదుపచార విధిష్వనుబోధితాం
సవినయాం సుహృదయం సముపాశ్రితామ్,
మమ సముద్ధర బుద్ధి మిమాం ప్రభో
వరగుణేన నవోఢవధూమివ.

టీక:-ప్రభో! సదుపచారవిధిషు = మంచిపూజావిధానములందు, అనుబోధితాం = క్రమముగా సుశిక్షితమైనదియు, సవినయాం = విధేయమైనదియు, సుహృదం = శుద్ధమైన మనస్సుగలదియు, సదుపాశ్రితాం = మంచియాశ్రయణముగలదియునగు, మమ = నాయొక్క, ఇమాంబుద్ధిం = ఈబుద్ధిని, వరగుణేన = శ్రేష్ఠమైనగుణము నుపదేశించుటచేత, నవోఢవధూమివ = క్రొత్తపెండ్లామువలె, సముద్ధర = ఉద్ధరింపుము.

తా:-ఈశ్వరా! మీపాదపూజయందు సుశిక్షితమై వినయముతోఁగూడిన నాబుద్ధికి ఉపచారముచేయుటయందు సుశిక్షితురాలును, వినయవంతురాలు నగు క్రొత్తగా పెండ్లిచేసికొనినభార్యనువలె నుపదేశించి యుద్ధరింపుము.

చ. కరముచితోపచారవిధిఁ గార్యములం గ్రమమొప్పనేర్చి, బం
ధురవినయంబుఁ జేకుఱిచి తోరపుఁగూరిమిఁబాదుగొల్పి సు
స్థిరమగు ప్రాపొసంగి మఱిదిద్దుము మామకబుద్ధి నీవు స
ద్వరుఁడు నవోఢయైన చెలువంబలె హైమవతీసతీశ్వరా! 78

అవ:—ఈశ్వరపాదప్రత్యక్షము గోరుచున్నారు.

శ్లో. నిత్యం యోగిమనస్సరోజదళ సంచారక్షమ స్త్వత్క్రమ
శ్శంభో తేన కథం కఠోరయమరాడ్వక్షః కవాటక్షతిః,
అత్యంతం మృదులం త్వదంఘ్రియుగళం హా మే మనశ్చింతయ
త్యేతల్లోచన గోచరం కురు విభో హస్తేన సంవాహయే.

టీక:—హే శంభో! త్వత్క్రమః = మీపాదవిన్యాసము, నిత్యం = ఎల్లప్పుడును, యోగిమనః = మునీశ్వరుల మనస్సనెడు, సరోజ = పద్మముయొక్క, దళ = రేకులతోకూడ, సంచార = తిరుగుటయందు, క్షమః = సమర్థమైనది, తేన = అట్టిమృదుపాదముతో, కఠోర = కఠినమైన, యమరాట్ = యమధర్మరాజుయొక్క, వక్షః కవాట = తలుపువంటి ఱొమ్ముయొక్క, క్షతిః = భేదనము (తన్నుట) కథం = ఎట్లు? అత్యంతంమృదులం = మిక్కిలి మార్దవముగల్గిన, త్వదంఘ్రియుగళం = మీపాదయుగ్మమునుగూర్చి, మేమనః = నామనస్సు, చింతయతి = చింతిల్లుచున్నది, హా = అయ్యో, ఏతత్ = ఈపాదయుగ్మమును, లోచన గోచరం = కన్నులకగపడుదానినిగా, కురు = చేయుము, హస్తేన = చేతితో, సంవాహయే = పట్టియొత్తెదను.

తా:—దేవా! మునీశ్వరుల మనఃపద్మములందు సంచరింపదగిన మీమృదుపాదములతో నాకఠోరమైన యా యముని ఱొమ్ము తన్నుట? అయ్యో! నామనస్సునకు మిక్కిలి విచారము గలుగుచున్నది. నాకన్నుల కగపడునట్లు చేయుము. నా చేతులతో మీపాదము లొత్తి సేవచేసెదను.

చ. సతతము యోగిహృత్కమలసంచరణక్షమమైన నీదు పా
దతలయు బల్కఠోరమగు ధర్మునురమ్మును దన్ననొవ్వదే
యతి మృదులమ్ము నీదుపదమంచుఁగటా! పలవించుచుందు వి
స్తృతకృప దానిఁజూపుమిటు చేతులనొత్తెద మెత్త మెత్తగన్! 79

అవ:—దానినే మరొకవిధముగాఁ జెప్పుచున్నారు.

శ్లో. ఏష్యత్యేష జనిం మనోఽస్య కఠినం తస్మిన్నటానీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః,
నోచే ద్దివ్యగృహాంతరేషు సుమనస్తల్పేషు వేద్యాదిషు
ప్రాయ స్సత్సు శిలాతలేషు నటనం శంభో కిమర్థం తవ.

టీక:—హేశంభో, ఏషః = వీఁడు, జనిం = ఉత్పత్తిని, ఏష్యతి = పొందబోవుచున్నాఁడు, అస్య మనః = వీని మనస్సు, కఠినం = కఠోరమైనది, తస్మిన్ = దానియందు, అటాని = సంచరింపవలసినవాఁడను, ఇతి = అని, మద్రక్షాయై = నా సంరక్షణముకొఱకు, కోమలపదన్యాసః = మృదువైన అడుగులు పెట్టుట, గిరిసీమ్ని = పర్వతప్రదేశమందు, పురా = పూర్వము, అభ్యాసితః = అలవాటు చేయబడినది, నోచేత్ = అట్లుకాదేని, దివ్యగృహాంతరేషు = అందమైనయిండ్లమధ్యప్రదేశములును, సుమనస్తల్పేషు = పూలపాన్పులును, వేద్యాదిషు = అరుగులు మొదలగునవియు, ప్రాయః = బాహుళ్యముగా, సత్సు = ఉండఁగా, శిలాతలేషు = రాతినేలలందు, తవ = నీకు, నటనం = నాట్యము, కిమర్థం = ఎందుకొఱకు ?

తా. శివా ! నీవు నన్నుగూర్చి యీపురుషుఁడు భూమిలోఁ పుట్టఁబోవును. వీని మనస్సు మిక్కిలి కఠినముగా నుండును. అప్పుడు నాకు దానియందు సంచరింపవలసి వచ్చును అని ఆలోచించి నారక్షణమునకై నేను పుట్టకపూర్వమే కఠినమైన కొండలమీద నీకోమలపాదములతో నడచుట కలవాటు చేసితివి. కానిచో మేడలు మిద్దెలు పూలపాన్పులు, మంచిమంచి అరుగులు ఉండఁగా నీకేల యీబాళ్ళమీద నాట్యము చేయవలసివచ్చినది ?

చ. జననమునొందు వీఁడిఁకను జాలకఠోరము వీనియెడ్ద నా
కననటనిల్చుటౌనని మదర్థము నీవు నగోర్వి మున్నె మె
త్తనిపదముంప నేర్చితివి తథ్యమకాక మరేమిలోప మ
య్యెనె జిగులోడు మాడువులు నింపగు తిన్నెలు పూవుసెజ్జలున్.

అవ:—ఇట్టిలక్షణములు గలవాఁడు జీవన్ముక్తుఁ డగునని చెప్పుచున్నారు.

శ్లో. కంచిత్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః
కంచిద్ధ్యాన సమాధిభిశ్చ నతిభిః కంచి త్కథాకర్ణనైః,

కంచిత్కాంచి దవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశా మీదృశీమ్
యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు.

టీక:— హే ఉమామహేశ ! కంచిత్కాలం=కొంతసేపు, భవతః=నీయొక్క, పాదారవిందార్చనైః = కమలములవంటి పాదముల పూజలతోడను, కంచిత్ = కొంత సేపు, ధ్యానసమాధిభిశ్చ = నిరంతరధ్యానముయొక్క నియమములతోడను, కంచిత్= కొంతసేపు, నతిభిః = నమస్కారములతోడను, కంచిత్ = కొంతసేపు, కథాకర్ణనైః = చరిత్రలు వినుటతోడను, కంచిత్ = కొంతసేపు, అవేక్షణైశ్చ = దర్శనముల తోడను, కంచిత్ = కొంతసేపు, నుతిభిః = స్తోత్రములతోడనుగూడి, ముదా = సంతోషముతో, త్వదర్పితమనాః = నీయందు నిలుపబడిన మనస్సుగలవాడై, ఈదృశీం = ఇట్టి, దశాం=స్థితిని, యః = ఏపురుషుడు, ప్రాప్నోతి = పొందుచున్నాడో, సః = వాడు, జీవన్ = జీవించియున్నవాడగుచునే, ముక్తః ఖలు = మోక్షమును పొందినవాడగునుగదా !

తా:— ఈశ్వరా ! ఒకప్పుడు మీపాదపూజలు, వేఱొకప్పుడు మీధ్యానంబులు ఇంకొకప్పుడు మీపాదవందనములు, మఱొకప్పుడు మీకథలు వినుట, కొన్నివేళల మీదర్శనముచేయుచు సంతోషము నొందువాడు జీవన్ముక్తుడగును.

సీ. తావకపాదరాజీవయుగ్మముఁ గడుం
గూర్మిఁ బూజించుచు గొంతసేపు
ఏకాగ్రబుద్ధినై యొసఁగి నిన్నెకరంబుఁ
జింతన జేయుచుం గొంతసేపు
ప్రణతిపూర్వకముగాఁ బరఁగి నీ సత్కథల్
కోరి యాలించుచుం గొంతసేపు
ఎలమి ముహుర్ముహుః కృతనుతిప్రకరంబు
గొరల నిన్గాంచుచుం గొంతసేపు
గీ. స్వాంతమును గేవలమ్ము నీవశ మొనర్చి
కడు ముదంబున నెవ్వండు కాలమెల్ల
వెడలఁబుచ్చునో యాతండు విశ్వనాథ !
బ్రతికియుండియు ముక్తుఁడై పరఁగు నిజము. 81

అవ:—శివుని యనుగ్రహముచలననే విష్ణువు మిగుల పూజ్యుడయ్యెనని చెప్పుచున్నారు.

శ్లో. బాణత్వం వృషభత్వమర్ధవపుషా భార్యాత్వమార్యాపతే
ఘోణిత్వం సఖితా మృదంగవహతా చేత్యాదిరూపం దధౌ
త్వత్పాదే నయనార్పణం చ కృతవాన్ త్వద్దేహభాగో హరిః
పూజ్యాత్పూజ్యతరస్స ఏవ హి న చేత్కో వా తదన్యోఽధికః.

టీక:—ఆర్యాపతే! హి = ఏ కారణముచలన, హరిః = విష్ణువు, బాణత్వం = నీకు బాణమగుటయు, వృషభత్వం = నందివాహనమగుటయు, అర్ధవపుషా = సగము శరీరముతో, భార్యాత్వం = భార్యయగుటయు, ఘోణిత్వం = వరాహమగుటయు, సఖితా = మోహినీరూపమున మిత్రమగుటయు, మృదంగవహతా చ = తాండవమప్పుడు మద్దెలగాడగుటయు, ఇత్యాదిరూపం = ఈ మొదలగు ఆకారమును, దధౌ = ధరించెనో, త్వత్పాదే = నీపాదమునందు, నయనార్పణం చ = (పద్మములు పూజించునప్పుడు వేయింటిపూర్తికిగా) నేత్రమును సమర్పించుటయు, కృతవాన్ = చేసినవాడయ్యెనో, చ = ఇంతేకాక, త్వద్దేహభాగః = నీదేహమం దొక్కభాగము గలవాడయ్యెనో, స ఏవ = ఆవిష్ణువే, పూజ్యాత్ = పూజ్యులైన బ్రహ్మాదులకన్న, పూజ్యతరః = ఎక్కువగా పూజింపతగినవాడు, నో చేత్ = అట్లు కాదేని, తదన్యః = ఆవిష్ణువుదక్క మఱియొక్కడు, అధికః = ఎక్కువవాఁడు, కో వా = ఎవ్వఁడు ?

తా:—ఓపార్వతీశ్వరా! త్రిపురసంహారకాలమందు విష్ణువు నీకు బాణమయ్యెను. వృషభరూపమైన నీకు వాహనముగా నుండెను. ఆర్యారూపంబుతో నీయర్ధాంగమున భార్యయై యొప్పారె. నీపాదసందర్శనకై వరాహరూప మెత్తెను. జగన్మోహినీరూపమున నీవాల్లభ్యము పొందెను. నీతాండవసమయమున మద్దెలవాయించెను. తననేత్రమును నీపాదములకడ నర్పించెను. మీయనుగ్రహమునకు పాత్రుడై మీయర్ధాంగసంగియగుటంబట్టియేకదా బ్రహ్మాదులందఱికంటె పూజ్యతరుం డయ్యెను. కానిచో నంతవాడింకెవ్వడైఁ గలడా? కనుక బ్రహ్మాదులు పూజ్యులు, విష్ణువు పూజ్యతరుడు, నీవు పూజ్యతముడవు.

మ. శరమై వాహనమై మృదంగవహుఁడై సానేన నర్ధాంగియై
కిరియై నెచ్చెలియై భజించె నిడె నక్షింగూడ నీయంఘ్రిపై

హరి ! నీదేహాపుటర్ధమైక నేఁ బ్రపూజ్యత్వంబు గాఁగన్నచోఁ
బరులమ్మేటిని మించువా రెవరికన్ భాషింపు విశ్వేశ్వరా ! 82

అవ:—ఇతరదేవతలను సేవించుటచే సుఖము లభింపదనియు, శివుని సేవించుట చేత పరమసౌఖ్యము లభించుననియుఁ జెప్పుచున్నారు.

శ్లో. జననమృతియుతానాం సేవయా దేవతానాం
న భవతి సుఖలేశస్సంశయో నాస్తి తత్ర
అజనీ మమృతరూపం సాంబమీశం భజంతే
య ఇహ పరమసౌఖ్యం తేహి ధన్యా లభంతే.

టీక:—జననమృతియుతానాం = చావుపుట్టుకతోఁ గూడిన, దేవతానాం = దేవతలయొక్క, సేవయా = సేవచేత, సుఖలేశః = సుఖము కొంచెమైనను, నభవతి = కలుగదు, తత్ర = అక్కడ, సంశయః = సందేహము, నాస్తి = లేదు, యే = ఏపురుషులు, అజనిం = ఉత్పత్తిశూన్యుడును, అమృతరూపం = మరణరహితమైనరూపము గలవాడును, సాంబం = శక్తితోఁ గూడినవాడును, ఈశం = శివుని, ఇహ = శరీరముండఁగనే, భజంతే = సేవించుచున్నారో, తే = వారు, ధన్యాః = కృతార్థులై, పరమసౌఖ్యం = మోక్షానందమును, లభంతే = పొందుదురు.

తా:—ఇతరదేవతలందఱు జననమరణములుగలవారు. అట్టివారిని సేవించువారికి విషయానందమైనను తృప్తిగాఁ గలుగదు. జననమరణములులేని పార్వతీపరమేశ్వరుని శరీరవంతులై యుండఁగనే సేవించువారు కృతార్థులై మోక్షానందమును పొందుదురు.

చ. తొలఁగని చావుపుట్టుకలతో వెతలంబడు దేవతావళిం
గొలిచిన సౌఖ్యసార మొనగూడునటంట హుళక్కి—నూవె యి
మ్ములఁ దమృతస్వరూపుఁడయి పుట్టుక గానని యీశునేజనుల్
గొలుతురొ వారికబ్బుఁగద గొబ్బున శాశ్వతసౌఖ్యసంపదల్. 83

అవ:—హృదయమందు బుద్ధితోఁగూడ విడువకయుండఁగోరుచున్నారు.

శ్లో. శివ తవ పరిచర్యాసన్నిధానాయ గౌర్యా
భవ మమ గుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే

సకల భువనబంధో సచ్చిదానందసింధో
సదయ హృదయగేహే సర్వదా సంవసత్వమ్.

టీక:—శివ ! భవ = సర్వోత్పాదకుఁడా ! సకలభువనబంధో = సమస్తలోకములకు బంధువైనవాఁడా ! సదయ = దయతోఁ గూడినవాఁడా ! సచ్చిదానందసింధో = సచ్చిదానందములకు సముద్రుఁడైనవాఁడా ! గౌర్యా = పార్వతితోఁ గూడినవాఁడా ! శివ = నీయొక్క, పరిచర్యాసన్నిధానాయ = సేవించుటకై సమీపమందుండుటకొఱకు, మమ = నాయొక్క, గుణధుర్యాం = సకలగుణములను వహించిన, బుద్ధికన్యాం = బుద్ధియనుకన్యను, ప్రదాస్యే = దానముచేసెదను, త్వం = నీవు, హృదయగేహే = నామనస్సను గృహమందు, సర్వదా = ఎల్లప్పుడు, సంవస = సుఖముగా నివసింపుము.

తా:—శంకరా ! సమస్తసద్గుణములుగల నాబుద్ధికన్యను నీకిత్తును. అది గౌరిని గూడి నీకు నిరంతరము సత్సపర్యలు చేయఁగలదు. నాహృదయసీమయందు గృహస్థుడవై సుఖముగా వసింపుము.

ఉ. నందితురంగ ! సద్గుణగణమ్ముల సన్నుతయౌ మదీయధీ
నందని నిత్తు నీకదియొనర్చును గౌరిసిఁగూడి నిత్యమ
స్పందతరంపుసేవ లపసారిత సంశ్రితనిద్ర ! సచ్చిదా
నందసముద్ర ! నిల్వుమిఁక నాహృదయాలయసీమ నిచ్చలుక్.

అవ:—నీకుఁగావలసిన యుపచారములు నేను సమకూర్పఁజాలనని వేఱొకతెఱఁగున ననుచున్నారు.

శ్లో. జలధిమథనదక్షో నైవ పాతాళభేదీ
న చ వనమృగయాయాం నైవ లుబ్ధః ప్రవీణః,
అశనకుసుమభూషావస్త్రముఖ్యాం సపర్యాం
కథయ కథమహం తే కల్పయానీందుమౌళే.

టీక:—ఇందుమౌళే = చంద్రుని శిరస్సున ధరించినవాఁడా ! తే = నీకు, అశన = ఆహారము, కుసుమ = పుష్పము, భూషా = భూషణము, వస్త్ర = వస్త్రమును, ముఖ్యాం = ప్రధానములుగాఁగల్గిన, సపర్యాం = పూజోపచారమును, కథంకల్పయాని =

ఎట్లుకల్పించేదను, కథయ = చెప్పుము, అహం = నేను, జలధిమథనదక్షః = సముద్రమును చిలుకుటకు చాలినవాడను, నైవ = కాను, పాతాళభేదీ = పాతాళలోకమున భేదించువాఁడను, నచ = కాను, వనమృగయాం = అడవియందు వేటాడుటయందు ప్రవీణః = నేర్పుగల, లుబ్ధక = బోయవాడను, నైవ = కాను.

తా:—చంద్రశేఖరా! నీకిష్టమైన కాలకూటాహారముగాని పుష్పమువలె శిరోభూషణముగ చంద్రునిగాని యిచ్చుటకు నేను సముద్రము మథింపగలవాడనుగాను. నీకిష్టమైన భుజగభూషణము కల్పించుటకు పాతాళమును భేదింపలేను. గజచర్మ వస్త్రము నిచ్చుటకు అడవులలోఁ వేటాడు బోయను కాలేను. ఇంక నిన్నెట్లు పూజింప నేర్తును?

చ. కడలినిఁ ద్రచ్చు దక్షతయుఁ గాననసీమల వేటలాడనౌ
గడుసుఁదనమ్ము నాగులజగమ్మునుజొచ్చుట కడ్డులేని పె
న్నడిమియు లేదు నాకడను గావున నీకగు నన్నవస్త్రముల్
దొడవులుగూర్చి కొల్చుటకు ధుర్యుఁడ నెట్లగుదున్ మహేశ్వరా!

అవ:—పూజాద్రవ్యములున్నను పూజాస్థానము తెలియకపోవుటవలనఁ బూజింప సమర్థుడనుగా ననుచున్నారు.

శ్లో. పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాం కథం కుర్మహే
పక్షిత్వం న చ వా కిటిత్వమపి న ప్రాప్తం మయా దుర్లభం
జానే మస్తకమంఘ్రిపల్లవముమాజానే న తేఽహం విభో
న జ్ఞాతం హి పితామహేన హరిణా తత్త్వేన తద్రూపిణా.

టీక:—ఉమాజానే = పార్వతిభార్యగాగలవాఁడా! పూజాద్రవ్యసమృద్ధయః = పూజించుటకు కావలసిన వస్తువులయొక్క అతిశయములు, విరచితాః = సమకూర్పఁబడినవి, పూజాం = పూజను, కథంకుర్మహే = ఎట్లుచేయుదుము, దుర్లభం = పొందశక్యముగాని, పక్షిత్వం = హంసరూపమగుటయు, నచవా = లేనిచో, కిటిత్వమపి = వరాహరూపమగుటయైనను, మయా = నాచేత, నప్రాప్తం = పొందబడలేదు, అహం = నేను, తే = నీయొక్క, మస్తకం = శిరస్సును, అంఘ్రిపల్లవం = చిగురువంటిపాదమును, నజానే = ఎఱుగను, విభో = సర్వవ్యాపకుఁడా! తద్రూపిణా = హంస, కిటిరూపములుపొందిన, పితామహేన = బ్రహ్మదేవునిచేతను, హరిణా = విష్ణువుచేతను, తత్త్వేన = యథార్థముగా, నజ్ఞాతంహి = తెలియబడలేదుగదా!

తా:-శంకరా! పూజాద్రవ్యములు విశేషముగా నున్నను నిన్ను పూజించు టెట్లు? నీశిరస్సు తెలియదు. నీపాదములు తెలియవు. హంసవరాహరూపములు ధరించి నిన్ను తెలిసికొన యత్నించిన బ్రహ్మవిష్ణువులే తెలిసికొనలేకపోయిరిగదా!

మ. శిరమెందో పదమెందొ నే నెఱుఁగ మిఁక శ్రీకంఠ! నీపూజకుఁ
దొరకో నేర సమర్చకుల్ వలయువస్తుల్ పెక్కులుంగల్గినన్
మఱి తత్సాధనకై పతత్కిటులుగా మారంగ నాకింతయున్
దర మే? మున్నటులయ్యుఁదా మెఱుఁగరే తత్త్వం బజోపేంద్రులున్.

అవ:-శివభక్తిమాత్రము కావలెనని కోరుచున్నారు.

శ్లో. అశనం గరళం ఫణీ కలాపో
వసనం చర్మ చ వాహనం మహోక్షః
మమ దాస్యసి కిం కి మస్తి శంభో
తవ పాదాంబుజభక్తి మేవ దేహి.

టీక:-శంభో! తవ = నీకు, అశనం=భోజనము, గరళం=విషము, కలాపః= భూషణము, ఫణీ=పాము, వసనం=వస్త్రము, చర్మ=ఏనుఁగుతోలు, వాహనంచ= వాహనమును, మహోక్షః=ముసలియెద్దు, కిందాస్యసి = ఏమియిచ్చెదవు? మమ= నాకు కావలసినది, కిం=ఏమి, అస్తి=ఉన్నది? తవ=నీయొక్క, పాదాంబుజభక్తి మేవ=పాదపద్మములయందు భక్తిమాత్రమే, దేహి=ఇమ్ము.

తా:-ఈశ్వరా! నీవు భుజించునది విషము. అలంకరించుకొనునది పాము. కట్టుబట్ట యేనుఁగుతోలు. వాహన మెద్దు. నీవేమి యిచ్చెదవు? నీపాదభక్తి యొక్కటే చాలునది యిమ్ము.

గీ. గరళమశనమ్ము దందశూకమ్ము తొడవు
వలువపులికళాసమ్ము కత్తళేఁడు గిత్త
యేమి యిత్తువునాకు? నీకేమిగలదు!
భవ! భవత్పాదపంకేజ భక్తినిమ్ము. 87

అవ:-ఇట్టివాఁడనగుదు నేని నీయర్చనము, స్తోత్రము, ధ్యానముఁజేయుసమర్థుఁడ నగుదునని చెప్పుచున్నారు.

శ్లో. యదా కృతాంభోనిధిసేతుబంధనః
కరస్థలాధఃకృతపర్వతాధిపః
భవాని తే లంఘితపద్మసంభవ
స్తదా శివార్చాస్తవభావనక్షమః.

టీక:- శివ! యదా = ఎప్పుడు, కృతఅంభోనిధి = చేయబడిన సముద్రమందు, సేతుబంధనః = వారధినిర్మాణముగలవాడను, కరస్థల = అఱచేతితో, అధఃకృత = దిగువకణచబడిన, పర్వతాధిపః = వింధ్యపర్వతముగలవాడను, లంఘిత = అతిశయింపఁబడి, పద్మసంభవః = బ్రహ్మదేవుడుగలవాడను, (అగుదునో) తదా = అప్పుడు, తే = నీయొక్క, అర్చా = పూజయందును, స్తవ = పొగడ్తయందును, భావన = ధ్యానమందును, క్షమః = సమర్థుడను, భవాని = అగుదును.

తా:- శంకరా! సముద్రమునకు వంతెనగట్టిన శ్రీరాముఁడును, అఱచేతితో వింధ్యను నేలకణచిన అగస్త్యుడును, బ్రహ్మదేవునికన్న నెక్కువవాడను నేనగుదు నేని నీ పూజాస్తోత్రధ్యానములు చేయుటకు సమర్థుడనుగా నుందును.

చ. కడలికి మధ్యసేతువును గట్టఁగఁగల్గిననాఁడు వింధ్యముః
గడుకొని పట్టియెత్తఁగలనాఁడు విరించి మహత్వమవ్వలం
గడపఁగఁగల్గునాఁడు శితికంఠ! పురాంతక! పాత్రమౌదు నీ
యుడిగఁపుఁగర్మకున్ నుతికి యోగ్యతమంబగు ధ్యాననిష్ఠకుః.

అవ:- ఈశ్వరునకు పూజనమును తాడనమునుగూడ ప్రియమైనది అని యెఱిఁగి తానాచరించుటకు అందెక్కువ ప్రియమైనది యేదియని యడుగుచున్నారు.

శ్లో. నతిభిర్నుతిభిస్త్వమీశ పూజా
విధిభిర్ధ్యానసమాధిభిర్న తుష్టః
ధనుషా ముసలేన చాశ్మభిర్వా
వద తే ప్రీతికరం తథా కరోమి.

టీక:- ఈశ! త్వం = నీవు, నతిభిః = నమస్కారముల చేతను, నుతిభిః = స్తోత్రములచేతను, పూజావిధిభిః = పూజావిధానములచేతను, ధ్యానసమాధిభిః = ధ్యానసమాధులచేతను, ధనుషా = వింటిదెబ్బలచేతను, ముసలేన = రోకలిపోట్లచేతను, అశ్మ

భిక్షా = రాళ్ళు రువ్వుటచేతనువలె, తుష్టః = సంతోషించినవాఁడవు, న = కావు, తే = నీకు, ప్రీతికరం = వైరెండింటిలో ఇష్టమైనది, వద = చెప్పుము, తథాకరోమి = అట్లు చేయుదును.

తా:_ఈశ్వరా ! నమస్కారములు, స్తోత్రములు, పూజలు, ధ్యానములు, సమాధులు మొదలగువానితో తృప్తిపడక, వింటిదెబ్బలు, రోకలిపోట్లు, రాళ్ళు రువ్వుట మొదలగువానితో పరమప్రీతి నొందితివని పురాణగాథలు వింటిని. ఇందు నీకేది ప్రియమో చెప్పు మట్లు చేసెదను.

మ. నతులన్ సన్నుతులన్ సమర్చనములన్ ప్రాంచన్మహాధ్యాన సం
గతులన్ నిత్యసమాధులన్ గరఁగవో కాళీశ్వరా! మూసల
క్షతులన్ జాపశిఖాహతుల్ పృథుశిలాఘాతంబులున్ నిన్ను బ్రీ
ణితుఁగావించునొ యేమొ తెల్పుమటులే నే నిన్ను సేవించెదన్.

అవ:_శక్తికొలఁది త్రికరణశుద్ధిగా నిన్ను సేవింతు ననుచున్నారు.

శ్లో. వచసా చరితం వదామి శంభో
రహముద్యోగవిధాసు తేఽప్రసక్తః
మనసాకృతి మీశ్వరస్య సేవే
శిరసా చైవ సదాశివం నమామి.

టీక:_అహం = నేను, తే = నీయొక్క, ఉద్యోగ = ఉన్నతయోగముల యొక్క, విధాసు = విధానములయందు, అప్రసక్తః = పరిచయము లేనివాఁడను, వచసా = వాక్కుచేత, శంభోః = సుఖస్వరూపుఁడవగు, తేచరితం = నీచరిత్రమును, వదామి = చెప్పుచున్నాను, మనసా = మనస్సుచేత, ఈశ్వరస్య = ఈశ్వరుఁడవైన, తవఆకృతిం = నీఆకారమును, సేవే = సేవించుచున్నాను, శిరసా = శిరస్సుచేత, సదాశివం = నిత్యసుఖస్వరూపుఁడవైన, త్వామేవ = నిన్నే, నమామిచ = నమస్కరించుచున్నాను.

తా:_దేవా ! ఉత్తమశివయోగముల పరిచయములేదు. మనస్సు స్థిరముగా నిలువదు. కనుక వాక్కుతో మీచరిత్రలు పల్కుచు, మనస్సున మీయాకృతి ధ్యానించుచు శిరస్సుతో మీపాదపద్మములకు నమస్కరించుచు శక్తివంచనలేక సేవించెదను.

చ. పురహర ! తావకీనమగు ప్రోన్నతయోగవిధంపుఁ బెంపులే
నెఱుఁగనుగాని వాకొనుదు నింత భవచ్చరితంబునోట నీ
శ్వర ! భవదాకృతింగొలుతు భావమునన్ నెలకొల్పి భక్తిమై
శిరమునువంచి మ్రొక్కుదును చేరి సదాశివ ! నీకునిత్యమున్.

అవ:—త్రికరణశుద్ధిగా నిన్ను సేవింతుననుచున్నారు.

శ్లో. ఆద్యాఽవిద్యా హృద్గతా నిర్గతాసీ
ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్
సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావే ముక్తేర్భాజనం రాజమౌళే.

టీక:—రాజమౌళే = చంద్రశేఖరా ! త్వత్ప్రసాదాత్ = నీయనుగ్రహమువలన, హృద్గతా = మనస్సునంటియున్న, ఆద్యా = మొట్టమొదటిదగు, అవిద్యా = అజ్ఞానము, నిర్గతా = తొలఁగిపోయినది, ఆసీత్ = అయ్యెను, యా = ఏజ్ఞానము, హృత్ = హృదయగ్రంథిని హరించునదియో, సావిద్యా = అజ్ఞానము, హృద్యా = హృదయమున ప్రవేశించినదయ్యెను, శ్రీకరం = సంపత్కరమును, ముక్తేః = మోక్షమునకు, భాజనం = ఆధారమైనదియునగు, త్వత్పదాబ్జం = నీపాదపద్మమును, భావే = మనస్సునందు, నిత్యం = ఎప్పుడును, సేవే = ధ్యానించుచున్నాను.

తా:—ఈశ్వరా ! నీదయవలన నాయజ్ఞానము తొలఁగిపోయి సుజ్ఞానము గలిగినది. సంపత్కరము మోక్షప్రదమగు నీపాదయుగ్మము సేవించెదను.

ఉ. స్వాంతమునంటియున్న యలప్రాక్తనమాయ తొలంగెఁ జొచ్చెఁజే
తోంతరవీథి నీదుకరుణాతిశయమ్మున హృద్యవిద్య సే
వింతు సతమ్ము ముక్తిఫలమీయఁగఁజాలు భవత్పదాబ్జమే
కాంతనితాంతభక్తి హృదయమ్మునఁ బాటిలఁ జంద్రశేఖరా !91

అవ:—ఈసంసారమునుండి కడదేర్పుమని వేఁడుచున్నారు.

శ్లో. దూరీకృతాని దురితాని దురక్షరాణి
దౌర్భాగ్యదుఃఖదురహంకృతిదుర్వచాంసి

సారం త్వదీయచరితం నితరాం పిబంతం
గౌరీశ మామిహ సముద్ధర సత్కటాక్షైః.

టీక:—గౌరీశ = శంకరా! దురక్షరాణి = బ్రహ్మవ్రాసిన దుష్టలిపిసూచకము లును, దురితాని = పాపకర్మలచేతఁ గలిగినదియు, దౌర్భాగ్య = దురదృష్టము, దుఃఖ = దుఃఖము, దురహంకృతి = అహంభావము, దుర్వచాంసి = పరుషభాషణము, సత్కటాక్షైః = నీకడగంటిచూపులచేత, దూరీకృతాని = దూరముగా పోఁగొట్టబడినవి, సారం = సారమైన, త్వదీయచరితం = నీచరిత్రను, నితరాం = మిక్కిలి, పిబంతం = గ్రోలుచున్న, మాం = నన్ను, ఇహ = ఈజన్మమందు, సముద్ధర = ఉద్ధరింపుము.

తా:—శంకరా! నుదుటవ్రాసిన బ్రహ్మవ్రాతకు సూచకంబులగు సమస్త దుఃఖములు నీకటాక్షమువలన పోయినవి. నీసారచరిత్రములనే విను నన్ను ఈ జన్మమునుండి తరింపఁజేయుము.

చ. దురితభరమ్ము వాసె నలదుర్విధివ్రాత తొలంగె లోనహం
కరణము డిందె హేయమగు కష్టపుదుర్దశమాసె దుర్వచ
స్ఫురణమడంగె నాకు శశిభూషణ! త్వచ్చరితామృతంపు ని
ర్ఝరములఁ గ్రోలుభాగ్యమును ప్రాప్తిలె నన్నిఁక నుద్ధరింపుమా!

అవ:—చిత్తమెప్పుడును పరబ్రహ్మమునందు విహరించుగాకయని ప్రార్థించుచున్నారు.

శ్లో. సోమకళాధరమౌళౌ
కోమలఘనకంధరే మహామహసి,
స్వామిని గిరిజానాథే
మామకహృదయం నిరంతరం రమతామ్.

టీక:—మామకహృదయం = నామనస్సు, సోమకళాధరమౌళౌ = శిరస్సున చంద్రకళ ధరించినట్టియు, కోమలఘనకంధరే = కోమలమైన మేఘమువంటి మెడగల్గినట్టియు, స్వామిని = సర్వనియామకమైనట్టియు, గిరిజానాథే = పార్వతీపతిరూపమైన, మహామహసి = గొప్పజ్యోతియందు, నిరంతరం = ఎల్లప్పుడు, రమతాం = క్రీడించుఁగాక!

తా. పార్వతీపరమేశ్వరరూపముతో వెలుగుచున్న పరంజ్యోతిస్వరూపమైన పరబ్రహ్మమునందు నాచిత్త మెప్పుడును విహరించుఁగాక !

చ. శిరమునఁ జంద్రరేఖ విలసిల్లఁ బయోదమువంటి నీలకం
ధర మెసలారఁ బర్వత సుతాపరమేశ్వరరూపమై జగ
మ్మురుతవహించి వెల్గునొకదొడ్డ మహస్సునఁ గ్రీడసల్పుచుం
బరగునుగాక ! ప్రత్యహముఁబాయక నాహృదయంబు ధన్యమై.

అవ:—నాలుక మొదలగునవి యీశ్వరాయత్తము లగుటచేతనే సాఫల్యంబు నొందునని చెప్పుచున్నారు.

శ్లో. సా రసనా తేనయనే తావవే కరౌ స ఏవ కృతకృత్యః
యా యే యౌ యో భర్గం వదతీక్షేతే సదార్చతః స్మరతి.

టీక:—యా = నాలుక, భర్గం = శివుని, వదతి = పలుకుచుండునో, యే = ఏకన్నులు, ఈక్షేతే = శివుని చూచుచుండునో, యౌ = ఏచేతులు, సదాఅర్చతః = ఎల్లప్పుడును శివుని పూజించుచుండునో, యః = ఏభక్తుడు, స్మరతి = శివుని తలంచుచుండునో, సా = అదియే, రసనా = నాలుక, తే నయనే = అవియే కన్నులు, తావేవ = అవియే, కరౌ = చేతులు, సఏవ = వాఁడే, కృతకృత్యః = ధన్యుఁడు.

తా:—సదా ఈశ్వరనామ ముచ్చరించు నాలుకయే నాలుక. ఈశ్వరునిచూచు కన్నులే కన్నులు. ఈశ్వరుని పూజించు చేతులే చేతులు. ఈశ్వరుని నిరంతరము ధ్యానించుభక్తుఁడే భక్తుడు. అతడే ధన్యుఁడు.

మ. ఎదికీర్తించును నెవ్విసూచు నెవి పెంపేపాఱ నర్చించు నె
మ్మది నెవ్వండు స్మరించు సంతతము సమ్యగ్భంగి నబ్భర్గు న
య్యదియే జిహ్వ యవే విలోకము లవే హస్తంబు లాతం డె సూ
బ్రదుకున్ ధన్యమొనర్చికొన్న నరమూర్ధన్యుండు ముమ్మాటికిన్.

అవ:—అతికఠినప్రదేశమందు సంచరింపవలసివచ్చినను సంశయము విడువుమని వేడుకొనుచున్నారు.

శ్లో. అతిమృదులౌ మమ చరణా వతికఠినం తే మనో భవానీశ,
ఇతి విచికిత్సాం సంత్యజ శివ కథ మాసీద్గిరౌ తథా ప్రవేశః.

టీక:—శివ ! భవానీపతే ! మమచరణౌ = నాపాదములు, అతిమృదుళౌ = మిక్కిలి మెత్తనివి, తే మనః = నీ మనస్సు, అతికఠినం = మిక్కిలి కఠినమైనది, ఇతి = అని, విచికిత్సాం = సంశయమును, సంత్యజ = విడువుము, తథా = అట్టి, గిరౌ = కొండమీఁద, ప్రవేశః = సంచారము, కథంఆసీత్ = ఎట్లయ్యెను ?

తా:—ఈశ్వరా ! నీభక్తుని మనస్సతికఠినము. కోమలమైన నాపాదములతో దానియందు సంచరించుటెట్లని సంశయ మక్కఱలేదు. అంతకఠోరముగానుండు పర్వతముమీఁద గౌరీసమేతులై మీరు సంచరించుటలేదా ?

గీ. విరియువలెఁ గోమలము నాదుచరణయుగము
ఱాయివలె బిట్టుగట్టిది నీయెడంద
యెట్లు చరియింతు నిందంచు నెంచఁబోకు
మభవ ! నీగృహంబు శిలోచ్చయంబుగాదె ? 95

అవ:—ఈశ్వరపాదమందు తనమనస్సును బంధింపవేడుకొనుచున్నారు.

శ్లో. ధైర్యాంకుశేన నిభృతం
రభసా దాకృష్య భక్తిశృంఖలయా
పురహరచరణాలానే
హృదయ మదేభం బధానచిద్యంత్రైః.

టీక:—పురహర = త్రిపురములను జయించినవాఁడా ! హృదయమదేభం = నామనస్సను మదపుటేనుఁగును, ధైర్యాంకుశేన = ధైర్యమనెడు అంకుశముతో, రభసాత్ = వేగమువలన, ఆకృష్య = వశపఱచుకొని, భక్తిశృంఖలయా = భక్తియను గొలుసుతో, చరణాలానే = మీపాదమను ఏనుగు కట్టుకొయ్యయందు, చిద్యంత్రైః = ఈశ్వరమహిమజ్ఞానంబులనెడు యంత్రములతో, నిభృతం = కదలకుండ, బధాన = బంధింపుము.

తా:—నామనస్సను మదపుటేనుగును ధైర్యాంకుశమునవంచి నీపాదమను కట్టుకంబమునందు భక్తియను గొలుసుతో గట్టిగా కట్టివేయుము.

గీ. సరభసమ్మున ధైర్యాంకుశమున నెంచి
మామకీన మనంబను మత్తకరిని

త్వత్పదంబను కట్టుకంబంబునందు
భక్తియను శృంఖలనుగట్టి నైవుమీశ ! 96

అవ:—మనస్సునకు శాశ్వతపదవిమ్మని కోరుచున్నారు.

శ్లో. ప్రచరత్యభితః ప్రగల్భవృత్త్యా
మదవానేష మనఃకరీ గరీయాన్,
పరిగృహ్య నయేన భక్తిరజ్వా
పరమ స్థాణుపదం దృఢన్న యామయిమ్.

టీక:—పరమ = ఓ పరిచ్ఛిన్నస్వరూపుఁడా ! మదవాన్ = మదముగల్గిన, గరీయాన్ = గొప్పదియగు, ఏషః = ఈ, మనఃకరీ=మనస్సను ఏనుఁగు, ప్రగల్భవృత్త్యా= ఆపరానిగమనముతో, అభితః = అంతటను, ప్రచరతి = సంచరించుచున్నది, అముం= దీనిని, భక్తిరజ్వా = భక్తియనుత్రాటితో, నయేన = అనునయముతో, పరిగృహ్య = పట్టుకొని, స్థాణుపదం = స్థిరమైన స్థానమును, దృఢం = గట్టిగా, నయ = పొందింపుము.

తా:—శంకరా ! నామనస్సను మదగజము పట్టుటకు వీలులేక పలువంకల పరుగు లెత్తుచున్నది. దీనిని భక్తియను త్రాటితోకట్టి స్థిరమైన బ్రహ్మపదమును జేర్పుము.

మ. కరముక్ మత్తిలియిమ్మనోద్విపము లొంగంబోక స్వచ్ఛందసం
చరణోద్వృత్తి మెలంగుచుండు నెటులేసాధించి దీనింగడుం
దిరమూ భక్తిభరైక రజ్జువున యుక్తింగట్టి చేఁబట్టి త
త్పరమస్థాణుపదంబునన్ దృఢముగా బంధింపు ధీమన్మణీ ! 97

అవ:—తన కవితాకన్యను గౌరీప్రియుండగు పరమేశ్వరున కర్పించుచున్నారు.

శ్లో. సర్వాలంకారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం
సద్భిస్సంస్తూయమానాంసరసగుణయుతాంలక్షితాంలక్షణాఢ్యాం
ఉద్యద్భూషావిశేషాముపగతవినయాం ద్యోతమానార్థరేఖాం
కల్యాణీం దేవ గౌరీప్రియ మమకవితా కన్యకాం త్వం గృహాణ.

టీక:-గౌరిప్రియ! దేవ! సర్వాలంకారయుక్తాం = సమస్తమైన ఉపమోత్ప్రేక్షాద్యలంకారములతో కూడినదియు (సమస్తభూషణములతో కూడిన) సరళపదయుతాం = మృదువైనశబ్దములతో కూడినదియు (మందమగు నడకలతో కూడిన) సాధువృత్తాం = సలక్షణమైన ఆర్యావృత్తాదులు గలదియు (మంచినడతగలదియు) సువర్ణాం = మంచిఅక్షరములు గలది (చక్కనిరూపముగలది) సద్భిః=కావ్యలక్షణము తెలిసిన పెద్దలచేత (శరీరలక్షణము) సంస్తూయమానాం = కొనియాడఁబడుచున్నదియు, సరసగుణయుతాం = శృంగారాదిరసములు మాధుర్యాదిగుణములతో కూడినదియు (భర్త కిష్టమగు గుణములతో కూడినదియు) లక్షితాం = ప్రతిపాద్యవస్తువు గలదియు (వరింపఁదగినదిగా నెన్నఁబడినదియు) లక్షణాఢ్యాం = సర్వలక్షణముల నొప్పునదియు, ఉద్యత్ భూషావిశేషాం = మిక్కిలి ప్రకాశించుచున్న అలంకారవిశేషముగలదియు (సుశీలత్వముగలది) ఉపగతవినయాం = తెలియబడినది వినయముగలదియు (కవియొక్క వినయముగలది పొందబడిన నమ్రతగలది) ద్యోతమాన = స్పష్టముగా స్ఫురించుచున్న, అర్థరేఖాం = అర్థముల పరంపరగలదియు (భాగ్యరేఖ గలదియు) కల్యాణిం = అర్థపుష్టిగా భాషించునదియునగు, మమ = నాయొక్క, కవితాకన్యకాం = కవితయనుకన్యకను, త్వం=నీవు, గృహాణ = స్వీకరింపుము.

తా:-దేవా! నాకవితాకన్య కన్యకాలక్షణములుగల్గి కల్యాణమునకుఁ దగియున్నది. సర్వాలంకారములు, సరళపదములు, సాధువృత్తము, సువర్ణము, సరసగుణములు వేయేల సర్వలక్షణములుగలిగి ప్రకాశించుచున్న నాకవితాకన్యను పరిగ్రహింపుము.

సీ. సరసగుణావళీసంపత్తి పెంపార
　　　　సరళ పదస్ఫూర్తి సంధిలంగ
ప్రథితసర్వాలంకరణదీప్తి యొసలార
　　　　సాధు వృత్తౌచిత్య సంగమెసఁగ
నిఖిల సులక్షణానీకంబు నెగడొంద
　　　　విద్యోత మానార్థ విభవమొలయ
కలితసువర్ణ రేఖాలక్ష్మి దళుకొత్త
　　　　వినయసౌభాగ్యంబు పెనగొనంగ

గీ. భూమలకు నెల్ల భూషయన్యొగడు నగడ
పాజ్ఞులొనఁ గల్యాణపదమునంది
తనరు మామక కావ్యకన్యను మహేశ !
యెలమి గ్రహియింపుమిదె సమర్పింతునీకు ! 98

అవః—హరిబ్రహ్మాదులకుఁగూడ గోచరముగాని నీవు నాకెట్లు ప్రసన్నుఁడ వగుదువో దేవా యని ప్రార్థించుచున్నారు.

శ్లో. ఇదం తే యుక్తం వా పరమశివ కారుణ్యజలధే
గతౌ తిర్యగ్రూపం తవ పదశిరోదర్శనధియా,
హరి బ్రహ్మాణౌ దివి భువి చరంతౌ శ్రమయుతౌ
కథం శంభో స్వామి న్కథయ మమ వేద్యోసి పురతః.

టీక:—పరమశివ ! కారుణ్యజలధే = దయాసముద్రుడా! తవ = నీయొక్క, పదశిరోదర్శనధియా = పాదములను శిరస్సును గనుగొనవలయునను బుద్ధితో, తిర్యగ్రూపం = తిర్యగ్జంతువులరూపములను (పంది, హంసరూపములు) గతౌ = పొందిన, తౌ = ఆ, హరిబ్రహ్మాణౌ = విష్ణుమూర్తియు బ్రహ్మయు, దివి = ఆకాశమందును, భువి = భూమియందును, చరంతౌ = సంచరించుచున్నవారలై, శ్రమయుతౌ = ఆయాసముతో కూడినవారలు, స్యాతాం = అయిరి, శంభో = స్వామిన్! మమపురతః = నాముందరను, వేద్యః = కనుఁగొనఁదగినవాఁడవు, కథంఅసి = ఎట్లుగా అగుదువు ? కథయ = చెప్పుము, ఇదం = ఇది, తే = నీకు, యుక్తంవా = తగునా ?

తా:—మీపాదదర్శనమునకై వరాహరూపముదాల్చి శ్రీహరియు, శిరోదర్శనమునకై హంసరూపముదాల్చి బ్రహ్మయు భూమ్యంతరిక్షములం దంతట తిరిగి ఫలము నందలేక పోయిరి. ఇప్పుడు నాయెదుట ప్రసన్నులై నాకెట్లు తెలియనగుదురో సెలవిండు.

ఉ. తావకశీర్షపాదతలదర్శనకాంక్ష మరాళఘోణులై
యావిధు విష్ణు లభ్రభువులందుఁ జరించి ప్రయాసమంది రీ
శా ! విధుమౌళి ! పాడియగునా ! యిదినీకు మదగ్రసీమ నిం
కేవిధిఁ దోచె దీవు నను నెట్టులఁగాతువొ తెల్పుమీశ్వరా ! 99

అవ:—శ్రీపరశివపరబ్రహ్మమునందును సకలదేవతాస్తోత్రములకు సర్వ్వాతయు సకలదేవతలకన్న నెక్కుడగు మాహాత్మ్యమును గలదని తెలుపుచున్నారు.

శ్లో. స్తోత్రేణాలమహం ప్రవచ్మి నమృషా దేవావిరించాదయ
స్తుత్యానాంగణనా ప్రసంగసమయేత్వామగ్రగణ్యం విదుః,
మాహాత్మ్యాగ్రవిచారణప్రకరణే ధానాతుష స్తోమవ
ద్ధూతాస్త్వాంవిదురుత్తమోత్తమఫలంశంభోభవత్సేవకాః.

టీక:—శంభో! భవత్సేవకాః=నీభక్తులైన, విరించాదయః = బ్రహ్మాదులగు, దేవాః=దేవతలు, స్తుత్యానాం=స్తుతింపఁదగినవారలయొక్క, గణనాప్రసంగసమయే= లెక్కనుగుణించి చర్చించునప్పుడు, త్వాం = నిన్ను, అగ్రగణ్యం = మొదటగణింప దగినవానిగా, విదుః = తెలిసికొనుచున్నారు, మాహాత్మ్య=మహిమనుగూర్చిన, అగ్రవిచారణ = మొదటిచర్చను, ప్రకరణే = చేయునప్పుడును, ధానాతుషస్తోమవత్ = సారములేనిధాన్యమునందలి పొట్టంతయుంబోలె, ధూతాః = కదలిపోయినవారలై, త్వాం=నిన్ను, ఉత్తమోత్తమఫలం=మిక్కిలి ఉత్తమమైనఫలముగా, విదుః=తెలిసి కొనుచున్నారు, స్తోత్రేణ = స్తుతిచేత, అలం=చాలును, అహం = నేను, మృషా = అసత్యము, నప్రవచ్మి = చెప్పను.

తా:—దేవా! బ్రహ్మాదులగు ముప్పదిమూడుకోట్లదేవతలును స్తోత్రార్హులను లెక్కించునప్పుడు నిన్ను మొట్టమొదటివానినిగా లెక్కించుచున్నారు. సృష్టిస్థితి లయరూపమైన మాహాత్మ్యమునుగుణించి చర్చించునప్పుడు ధాన్యపురాశి యెగురఁ బట్టునపుడు పొట్టు అంతయు దూరముగా పోవునట్లు తామందఱు దూరమైపోయి సారమైనధాన్యమువలె నిన్నుత్తమోత్తమునిగా గనుగొనుచున్నారు. ఇది వట్టి స్తుతి పాఠముగాదు. నేను చెప్పినదంతయు నిజముగా నియిసుమంతయు నసత్యముగాదు.

చ. వలదు పొగడ్తలింకఁగలభంగివచింతు విరించి దొట్టివే
ల్పులు స్తవనీయులందు నినుమున్ను వచింత్రు మహత్వనిర్ణయం
బొలసినపట్ల పొట్టువలె నొక్కట తామెగుపొంది తేలుచున్—
దెలియదు దురుత్తమోత్తమపు దివ్యఫలంబని నిన్ను శంకరా!

# గ్రంథాంతము

శ్రీ దేవాఖ్యనగరవా
సీ! దిగ్దంతీంద్ర దంతశేఖర విశ్రాం
తోదారయశస్స్ఫూర్తి!
స్వాదూదగభీరభావ భాసురమూర్తీ!

మాలిని. సులలిత విభవేంద్రా! శుంభదౌదార్యసాంద్రా!
ప్రలసితగుణభారా! రత్నమాంబా కుమారా!
దళిత రిపుకదంబా! త్యాగశీలావలంబా!
బలి తిరుపతిరాయా! పూతచారిత్రగేయా!

మ. పరకాంతా పరవిత్తకాంక్షిత గుణాభావా! ప్రశస్తాకృతీ!
సరసాంచత్కవితామృతోచ్ఛ్రిత ఝరీసమ్మగ్నభావాయతీ!
స్ఫురితప్రాక్తన జన్మగంధ విలసత్పుణ్యాకృతీ! సత్కృతీ!
మురజిద్ధామ సమాన దేవనగరీ భూమీపతీ! తిర్పతీ!

గద్య

ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర శిష్టావంశకలశ వారాశిరాకాకైరవ
మిత్ర పవిత్రచరిత్ర నరసమాంబా సూర్యనారాయణశాస్త్రి
పుత్ర కవిభూషణ కవిశేఖర బిరుదాంకిత వేంకటసుబ్బయ
నామధేయ ప్రణీతాంధ్ర శివానందలహరి
సంపూర్ణము.



---

మెజస్టిక్ ప్రెస్, రాజమండ్రి:–1958.

# శుద్ధపత్రిక.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 4 | ప్రథాసాంధ్రో | ప్రథానాంధ్ర |
| 4 | 15 | మచ్చైతో | మచ్ఛైతో |
| 6 | 17 | పారతోషికము | పారితోషికము |
| 2 | 3 | చిరాయురిప్రి | చిరాయురీప్సి |
| 9 | 12 | శోభిల్లగ | శోభిల్లగన్ |
| 19 | 2 | శక్తి | సక్తి |
| 22 | 9 | యతీరపి | యతిరపి |
| 23 | 20 | కాననో | కాననో |
| 23 | 20 | బైటనో | బైటనో |
| 25 | 22 | వశుపతే | పశుపతే |
| 27 | 15 | ఫలద్వా | ఫలాద్వా |
| 28 | 17 | ఓకః | ఏకః |
| 32 | 24 | అని శం | అనిశం |
| 35 | 13 | తామరసా | తామరసో |
| 35 | 22 | దృష్ట్వౌ | దృష్ట్వా |
| 42 | 20 | గోరంగిన | గోరందగిన |
| 43 | 5 | భవదైర్యం | భవద్ధైర్యం |
| 47 | 12 | జేంసాక | బెంపాడు |
| 51 | 1 | విద్యా | విద్యా |
| 51 | 7 | చక్షుదా | చక్షురా |
| 51 | 8 | లక్షల | లక్షణ |
| 51 | 8 | దుర్గ | దుర్గా |
| 51 | 17 | కాంవార | కాంతార |
| 54 | 1 | విహారకుందు | విహారంకును |

| | | | |
|---|---|---|---|
| 56 | 24 | మనస్సును | మనస్సను |
| 57 | 19 | విజృంజించు | విజృంభించు |
| 57 | 23 | ఆసకృత్ | అసకృత్ |
| 60 | 7 | మన్మనోజ్ఞ | మన్మనోజ్ఞ |
| 69 | 21 | క్రోవించు | క్రోలించు |
| 70 | 10 | ప్రా గిలి | ప్రాంతగిలి |
| 72 | 6 | నైత్తేన | నైత్తేద |
| 73 | 4 | యొనర్చుటు వశ్యమున్ | యొనర్చు టువశ్యమున్ |
| 76 | 5 | విశ్యద్విగ్రసుండు | విద్వద్విగ్రహుండు |
| 76 | 9 | కిల్బిషపూన్ | కిల్బిషరిపూన్ |
| 77 | 9 | దివాశ్రితం | దివ్యాశ్రితం |
| 77 | 12 | కృతార్థాం | కృతార్థాః |
| 78 | 11 | చెనో | చెశా |
| 78 | 21 | మర్వాష | దుర్వాస |
| 78 | 26 | దూర్వాసన | దుర్వాసన |
| 79 | 17 | ఘటిల్లక | ఘటిల్ల |
| 79 | 20 | మటిల్లఁగ | ఘటిల్లఁగ |
| 83 | 27 | కర్ణవైః | కర్ణనైః |
| 85 | 4 | ఘూర్ణిత్వ | ఘూర్ణిస్వం |
| 85 | 13 | కృతవాతన్ | కృతవాన్ = |
| 86 | 7 | అజనీ | ఆజని |
| 94 | 15 | కలా | కరా |
| 95 | 25 | నెంచి | నొంచి |
| 96 | 17 | చరణోద్వత్తి | చరణోవృత్తి |
| 97 | 12 | నమృత | నమ్రత |
| 99 | 25 | దెలి[illegible]  | దెలియుచు |